# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్.

Registered No. H-373.

సంపుటి 3 డిసెంబర్, 1958—పుష్యము, శాలివాహనశకము-1880 సంచిక 2

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.



ఆర్మూరు తాలూకా (నిజామాబాదు) చవుటుపల్లిలో శ్రీ సంజీవరెడ్డి దంపతులు : అక్కడ శ్రీమతి సంజీవరెడ్డి 11.10.58 న ప్రసూతి వార్డును ప్రారంభించారు.



ప్రసూతివార్డు దృశ్యం.



# ఆంధ్రప్రదేశ్

డిసెంబర్, 1958.

సంపుటి 3 సంచిక 2

పుష్యము, శాలివాహనశకము-1880.

## విషయసూచిక



## ముఖచిత్రం

కాకినాడ వైద్య కళాశాల: 17-11-58 న ముఖ్యమంత్రిచే ప్రారంభించ బడింది.

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.



# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి:

*మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| ***12*** *సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు* | పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5 000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. |
| ***10*** *సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు. |
| ***పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅక్కౌంట్లు*** | రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది. |

15 సంవత్సరముల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు రూ. 3,325, రూ.6,650, రూ 13,300 రూ. 26,600. | ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది.<br>వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ 26,600 ల వరకు కొనవచ్చు. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*

## *భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఇలా పెట్టుబళ్ళకి సంబంధించిన సాహిత్యానికి కొరకు:

నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకైనా లేక

రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)

చిరునామాకి కాని వ్రాయాలి.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైద్రాబాదు దక్కన్ — 1.



గుంటూరు వైద్య కళాశాల పురుషుల వసతిగృహ భవనం : దీనిని 16-11-58 న రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.

# భవన నిర్మాణం

అభివృద్ధి కార్యక్రమాలలో భవన నిర్మాణం ఒక భాగమై వున్నది. ఇది రాష్ట్రంలో దాదాపు అన్ని శాఖలకి సంబంధించినది. ఈ పని భవనాలు, ప్రజారోగ్య చీఫ్ ఇంజనీరు అధ్వర్యంలో జరుగుతుంది. ఈ విషయంలో గడచిన సంవత్సరం వివిధ అభివృద్ధి పథకాల క్రింద జరిగిన పని వివరాలు క్లుప్తంగా దిగువ సూచించ బడినవి.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ యేర్పడింది. ఇందువల్ల కార్యాలయాలకి, అధికారులకి, సిబ్బందికి తగిన వసతిని, అదనపు వసతిని సమకూర్చవలసి వచ్చింది. ఇందు నిమిత్తం హైదరాబాదులో భవన నిర్మాణం పనులకై ప్రణాళిక (1956-61) లో మొదట రూ. 152.00 లక్షలు కేటాయించ బడినవి. ఈ పద్దు క్రింద 1957 మార్చి నెలాఖరు నాటికి పూర్తి చేయబడిన వివిధ పథకాలు యివి : తాత్కాలిక సెక్రటేరియట్ భవనాలపై మరొక అంతస్తు నిర్మాణం; హైకోర్టు భవనాల అభివృద్ధి, ప్రత్యేక మరమ్మతులు; హైకోర్టులో షెడ్డుల నిర్మాణం; శాసనసభ భవనం విస్తరణ: కార్యాలయాలు, అధికారులకై ప్రైవేటు, ప్రభుత్వ భవనాల అభివృద్ధి, చేర్పులు.

రాష్ట్రం యేర్పడిన మలి సంవత్సరంలో దిగువ పనులు పూర్తి చేయబడినవి: అసంపూర్తిగా నిలిచిన 100 జూనియర్ ఆఫీసర్ల గృహాల నిర్మాణం, 1000 సిబ్బంది గృహాలు, రాజభవన్‌కి చేర్పులు, అభివృద్ధిలు

రాజభవన్‌లో సిబ్బంది గృహాలు, గెరాజ్‌లనిర్మాణం, జూబ్లీహాలును యెగువ సభగా మార్చుటకు చేర్పులు, హైకోర్టు తొలి అంచె అదనపు భవనాల నిర్మాణం. క్రింద పనులు ఇప్పుడు జరుగుతున్నవి. రాజభవన్‌లో అతిథి గృహం నిర్మాణం, శాసన సభ్యులకి 50 కుటుంబరకం, 50 వసతిగృహంరకం యిళ్లనిర్మాణం, హైకోర్టులో రెండవ అంచె అదనపు భవనాల నిర్మాణం.

## యాత్రిక కేంద్రాల అభివృద్ధి

రాష్ట్రంలోని వివిధ యాత్రా కేంద్రాలలో భవన నిర్మాణం పనులను చేపట్టుటకై రాష్ట్రప్రణాళిక (1956-61) లో రూ 3.71 లక్షలు కేటాయించ బడినవి. ఆ ప్రకారం శ్రీశైలం, సింహాచలం, మహానంది, అమరావతి, అహోబిలం, లేపాక్షి మున్నగు ముఖ్యమైన యాత్రా కేంద్రాలలో విశ్రాంతి కేంద్రాల (రెస్టుహౌసెస్) నిర్మాణం సంకల్పించ బడింది. శ్రీశైలం, సింహాచలం, మహానంది లలో పనులు అప్పుడే ప్రారంభమై కొనసాగుతున్నవి. అమరావతి విశ్రాంతి కేంద్రం పని చేపట్ట బడుతున్నది.

## హైదరాబాదు నీటి సరఫరా పనుల మార్పు

పట్టణ నీటి సరఫరా, కార్పొరేషన్ నీటి సరఫరా, పారిశుద్ధ్య పథకాల అభివృద్ధికై కేంద్ర ప్రభుత్వం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఒక పథకాన్ని ప్రారంభించింది. సొమ్ము అప్పుగా వివిధ రాష్ట్రాల కార్పొరేషన్లకి యివ్వబడు తుంది ఆంధ్రప్రదేశ్ లో హైదరాబాదు, సికిందరాబాదు మునిసిపలు కార్పొరేషన్లకై కోటి రూపాయలు కేటాయించ బడ్డాయి. ఇది నీటి సరఫరా, పారిశుద్ధ్య పథకాలు రెండిటికి వుద్దేశించ బడింది. ఈ సొమ్మును ఖర్చు చేయుటకై హైదరాబాదు నీటి సరఫరా పనుల మార్పుకి సంబంధించిన రూ 54.53 లక్షలు ఖర్చుయే పథకాలు తయారు చేయబడినవి. ఒక్క అస్మాన్‌ఘర్ దిగువ జలాశయం నిర్మాణ పథకాన్ని మాత్రమే రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది. ఆపని యిప్పుడు జరుగుతున్నది.

పై పథకాలు కాక వివిధశాఖల భవననిర్మాణ పథకాలు చాలా వున్నాయి. వాటికి సంబంధించిన ప్రణాళికలను ఆయా శాఖాధిపతులు తయారు చేస్తారు. పబ్లిక్‌వర్కుస్‌శాఖ ఆపథకాలను అమలు పరచే సంస్థగా పనిచేస్తుంది.

1-11-57, 18-10-58 మధ్య ప్రారంభమై కొనసాగుతున్న ముఖ్యమైన భవన నిర్మాణం పనులలో కొన్ని దిగువ యివ్వబడినవి.

హైదరాబాదులో వైద్య. ప్రజారోగ్య పథకాలు: హైదరాబాదులో స్త్రీల కళాశాలావరణలో వుస్మానియా వైద్య కళాశాల నిర్మాణం రూ. 61.00 లక్షల అంచనా ఖర్చుపై చేపట్టబడ, కొనసాగుతున్నది. ఉస్మానియా జనరల్ ఆస్పత్రి అభివృద్ధికై రూ. 1.70 లక్షలతో కోల్డుస్టోరేజిగల మార్చ్యురీ బ్లాకు నిర్మాణం, రూ. 2.84 లక్షలతో పాథోలజీ, మ్యూజియంల విస్తరణ, రూ. 1.97 లక్షలతో కొత్త వంటశాల నిర్మాణం చేపట్టబడినవి. కె. ఇ. ఎమ్. ఆస్పత్రి, గాంధీ వైద్య కళాశాలల అభివృద్ధికింద దిగువ పనులు చేపట్టబడినవి: రూ. 1.17 లక్షలపై కె.ఇ.ఎమ్. ఆస్పత్రి మొదటి అంతస్తుకి తిరిగి కప్పువేయుట, రూ. 1.12 లక్షల పై సిమెంటు కాంక్రీటు పూతతో మళ్లింపు రోడ్డు నిర్మాణం, రూ. 1.73 లక్షల పై గాంధీ వైద్య కళాశాలకి - చేర్పులు, మార్పులు, రూ. 7.28 లక్షల పై కె. ఇ. ఎమ్. ఆస్పత్రి 1,2 అంచెల విస్తరణ, రూ. 2.18 లక్షల భీమాపొందిన కార్మికులు మున్నగువారికై పై 32 మంచాలవార్డు, హైదరాబాదులో రూ. 4.01 లక్షలు ఖర్చయే క్షయనివారణ ప్రదర్శన కేంద్రం, పిచ్చాసుపత్రి అభివృద్ధి, ఇర్రంనూమాలో అదనంగా క్షయవార్డుల నిర్మాణం, ప్రజారోగ్య లేబొరేటరీ నిర్మాణం, లింగంపల్లి ఫీవర్ ఆస్పత్రిలో అదనపువార్డులు, వి. జెడ్. ఆస్పత్రి, సరోజినీదేవి ఆస్పత్రిలలో అదనపుపనులు వంటి ముఖ్యమైన పనులు కూడా కొనసాగుతున్నాయి.

## గుంటూరులో

గుంటూరులో ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి నిర్మాణం తొలి పంచవర్ష ప్రణాళికకాలంలో రూ. 48.80

లక్షల అంచనాఖర్చుపై చేపట్టబడింది. అప్పటినుంచి యిప్పటికి 15 పుపపనులలోను 12 పూర్తిఅయినవి. మిగిలిన మూడింటిని యింక ప్రారంభించాలి. తొలి పంచవర్ష ప్రణాళికకాలంలో రూ. 30.25 లక్షల ఖర్చుపై. గుంటూరు వైద్య కళాశాల నిర్మాణం కూడా చేపట్టబడింది. ఈ విషయంలో యిప్పటికి 19 పుప-పనులు పూర్తి అయినవి. మిగిలినవి కొన సాగుతున్నవి. రూ. 4.82 లక్షలు వ్యయం కాగల పాథోలజీబ్లాకు రెండవ అంతస్తు నిర్మాణం పూర్తి కావస్తున్నది. విద్యార్థినుల వసతిగృహం మొదటి అంతస్తు పని ప్రారంభించబడింది. ఈ సంవత్సరం చేపట్టబడగల పరీక్ష-గ్రంథాలయం నిమిత్తం ప్రభుత్వం రూ. 2.65 లక్షలను మంజూరు చేసింది.

## కర్నూలులో

దిగువ పనులకై 1957 లో ప్రభుత్వం మొత్తం రూ. 8.000 లక్షల్ని మంజూరు చేసింది. పేడియాట్రిక్ వార్డు, లైబ్రరీతో సహా క్లినికల్ లెక్చర్ థియేటరు, కామన్ వెయిటింగ్ హాలుల నిర్మాణం, శస్త్ర చికిత్స, పరిపాలనా వ్యవహార బ్లాకులో లిఫ్టు యేర్పాటు, మార్చ్యుయరీ బ్లాకు, వైద్య కళాశాల వసతికై సెక్రిటేరియట్ భవనాల మార్పు, 52 మంచాల మెడికల్ వార్డు, పరిపాలనా వ్యవహార బ్లాకులో షాహాబాద్ ఫ్లోరింగు. లిఫ్టు యేర్పాటు మినహా దాదాపు యీ పనులన్ని పూర్తి అయినవి. 1958లో దిగువ పనులు మంజూరు చేయబడినవి : మార్చ్యుయరీ బ్లాకుకి రెఫ్రిజిరేషన్ ప్లాంటు, ఆపరేషన్ థియేటరుకి ఎయిర్ కండిషనింగు, వరండాలను కట్టుట. వాటి పనిని యింకా చేపట్ట వలసి వున్నది. హెచ్.టి. ట్రాన్సుఫార్మర్ల విషయంలో పని జరుగుతున్నది.

## వైజాగులో

ఆంధ్ర వైద్య కళాశాలలో కొత్త శారీరశాస్త్ర బ్లాకు నిర్మించబడింది. కింగ్‌జార్జి ఆస్పత్రిలో ఔట్ పేషెంటు శా. విస్తరణ, కి. జా. ఆస్పత్రిలో 75 మంచాల క్షయ విశి వార్డు, అంటువ్యాధుల ఆస్పత్రిలో సిబ్బంది గృహాలపై పని మొత్తం రూ. 9.36 లక్షలపై కొనసాగుతున్నది. రూ. 2.37 లక్షలతో కొత్తగా మార్చ్యుయరీ బ్లాకు నిర్మించబడింది. రూ. 1.43 లక్షల ఖర్చుతో వాల్తేరు ఆస్పత్రికి ప్రహారీ గోడ నిర్మించ బడుతున్నది. ప్రభుత్వం దిగువ పనులను కూడా మంజూరు చేసింది: 50 మంచాల వార్డు, ఆపరేషన్ థియేటరుల నిర్మాణం ఎ.ఎమ్.సి. లో రెండవ అంతస్తుపై తేలిక కట్టడం, రెండు వంటశాలలు, ఔట్ పేషెంటు శాఖకి మూడంతస్తుల భవనాలు, నర్సుల గృహాల నిర్మాణం, పిల్లల పాతవార్డు అభివృద్ధి. వీటన్నిటికి మొత్తం రూ. 7.90 లక్షలు ఖర్చు కాగలదని అంచనా ఈ పనులను యింక ప్రారంభించాలి.

పై పెద్ద పథకాలకు తోడు జిల్లా ముఖ్య పట్నాల ఆస్పత్రుల నిర్మాణం కూడా చేపట్టబడింది. దిగువ పనులు జరుగుతున్నాయి : కడపలో రూ. 4.03 లక్షలపైనా, అనంతపురంలో రూ. 19.25 లక్షలపైనా, మచిలీ పట్నంలో రూ. 0.94 లక్షల పైనా, హెడ్‌క్వార్టర్సు ఆస్పత్రి అదనపు భవనాల నిర్మాణం, నెల్లూరులో క్షయ ఆస్పత్రిలో ట్విన్ ఆపరేషన్ థియేటరు, మార్చ్యుయరీ ఓ. పి. బ్లాకు, 40 మంచాల వార్డు.

కరీంనగరం, సంగారెడ్డిలలో జిల్లా ముఖ్య పట్నాల ఆస్పత్రుల అభివృద్ధికై అంచనాలను ప్రభుత్వం యిదివరకే మంజూరు చేసింది. వరంగల్లు, నిజామాబాదు, మహబూబునగరం, నల్గొండ, ఆదిలాబాదు, ఖమ్మం, హైదరాబాదుల పథకాల అంచనాలు మంజూరు కాగలవని భావించ బడుతున్నది. తాలూకా ముఖ్య పట్నాల ఆస్పత్రుల అభివృద్ధి క్రింద అమలాపురం, గురజాల, పత్తికొండ, ఆదోని, కోయక్‌కుంట్ల, ప్రొద్దటూరు ప్రసూతి వార్డుల పథకాలు పూర్తికాగా, రాయచోటి, తిరుపతి, భద్రాచలాలలో యింకా పని జరుగుతున్నది. తెలంగాణా ప్రాంతంలో జడ్‌చర్ల సిద్ధిపేట, జగిత్యాల, కామారెడ్డి, యెల్లారెడ్డి, నిజామాబాదులలో అములుకై వుద్దేశించిన అట్టి పథకాలకి తుది రూపమివ్వబడింది.

## సాంకేతిక విద్య

అనంతపురం ఇంజనీరింగు కళాశాలలో రూ. 18.00 లక్షల అంచనా ఖర్చుపై 1954 లో మంజూరైన పనులన్నీ పూర్తి అయినవి. కాకినాడలో అట్టిదే రూ. 18.00 లక్షలు వ్యయమయ్యే పథకం పని పూర్తి కావస్తున్నది. అనంతపురంలో పి. పి. సి. నిమిత్తం 1957 లో మంజూరైన ఇంజనీరింగు కళాశాల పూర్తి అయింది, కాకినాడలో పని జరుగుతున్నది. గూడూరు, కొత్తపేటలలో గనుల తవ్వకం సంస్థలకై వరుసగా రూ. 3.92 లక్షలు, రూ. 4.93 లక్షల అంచనాలపై భవనాలు నిర్మించబడుతున్నాయి. వరంగల్లులో రూ. 9.15 లక్షల ఖర్చుపై పాలీ టెక్నిక్ సంస్థ నిర్మించ బడుతున్నది. విశాఖపట్నంలో యిటీవల ప్రారంభింపబడిన పాలీ టెక్నిక్ సంస్థకై ప్రభుత్వం రూ. 11.00 లక్షల్ని మంజూరు చేసింది. దిగువ పథకాలు అమలు జరుగుతున్నాయి. హైదరాబాదు గృహ శాస్త్ర శిక్షణా కళాశాలకి వసతిగృహం, కాకినాడ పారిశ్రామిక టి.ఐ. బాగు, నిజామాబాదు సాంకేతిక శిక్షణా కేంద్రానికి వర్కుషాపు షెడ్డు నిర్మాణం, హైదరాబాదు సెంట్రల్ క్రాఫ్ట్సు సంస్థలో మరొక షెడ్డు.

జరిగే సంవత్సరంలో చేపట్టబడే దిగువ పథకాలను కూడా ప్రభుత్వం మంజూరు చేసింది.

1. విజయవాడలో రూ. 5.00 లక్షలపై పారిశ్రామిక శిక్షణా సంస్థ నిర్మాణం.

2. కాకినాడలో రూ. 2.52 లక్షలపై పారిశ్రామిక శిక్షణా సంస్థ నిర్మాణం.

3 కాకినాడలో రూ. 2.52 లక్షలపై పాలీ టెక్నిక్ సంస్థ విస్తరణ.

## విద్య (సాధారణ)

తాడికొండ ప్రభుత్వ బి. టి. స్కూలు పథకం అంచనా రూ. 1.94 లక్షలు. పెంటపాడు సీనియర్, జూనియర్ మోడల్ స్కూలు పథకం అంచనా



నిజామాబాదు జిల్లా ఆర్మూరులో ప్రభుత్వోన్నత పాఠశాల నూతన భవనం (11-10-58 న రాష్ట్ర ముఖ్యమంత్రిచే ప్రారంభింపబడినది).

రూ. 1.29 లక్షలు. ప్రొద్దుటూరు, రాయచోటి, మైనంపాడులలో కొన్ని బి. టి. స్కూళ్లకు తరగతి గదులు వగైరా, శ్రీకాకుళంలో ఆర్ట్సు కాలేజీ నిర్మాణాల వ్యయం రూ. 11.45 లక్షలు. పై పథకాలు, వెంకటాపురంలో వున్నతపాఠశాల, మచిలీపట్నంలో లేడీ ఆమ్‌ప్తిల్ బి, టి. స్కూలు పథకాల క్రింద పని జరుగుతున్నది. రాజమండ్రీ ప్రభుత్వ ట్రైనింగు కళాశాల పని పూర్తిఅయింది. లక్డీ బజార్‌లో వున్నతపాఠశాలలు, హనుమకొండలో బాలికోన్నత పాఠశాలలు, తెలంగాణా ప్రాంతంలో వున్నత పాఠశాలలకై 15 భవనాల నిర్మాణం పని కూడా చేపట్టబడింది. దిగువ పనులు యిటీవల ప్రారంభించబడినవి: మహబూబాబాదులో రూ. 0.75 లక్షలపై బహుళార్థసాధక వున్నత పాఠశాల, హైదరాబాదులో కేంద్ర గ్రంథాలయం, మహబూబ్‌నగరం, కరీంనగరం, నల్గొండ, మేడ్‌చల్, వరంగల్లులలో ఒక్కొక్కచోట రూ. 2.10 లక్షలపై బి. టి. స్కూళ్ల నిర్మాణం. బొలారం, జగిత్యాలల్లో బహుళార్థసాధక వున్నత పాఠశాలలు యిటీవలే ప్రారంభింపబడినవి.

## అటవీశాఖ భవనాలు

హైదరాబాదులో అడవుల చీఫ్ కన్సర్వేటరు కార్యాలయ భవనం అభివృద్ధికి, చేర్పులకి రూ. 7.59 లక్షలపై మంజూరైన పథకం అమలుజరుగుతున్నది. వైజాగ్, విశాఖపట్నం, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాల ఏజన్సీప్రాంతాలలో సంకల్పించబడిన సిబ్బంది గృహాలు మున్నగునవి యిటీవలే మంజూరు చేయబడినవి.

## వ్యావసాయిక భవనాలు

రాజేంద్రనగర్‌లో రూ. 12.26 లక్షల అంచనా ఖర్చుపై ప్రారంభింపబడిన వ్యవసాయ కళాశాల నిర్మాణంలో మిగిలిపోయిన పని పూర్తిచేయబడినది. దిగువ పథకాలు కొనసాగుతున్నాయి: అనకాపల్లి చెఱుకు పరిశోధన కేంద్రంలో పథకాలు, నంద్యాలలో వ్యవసాయ పరిశోధన కేంద్రం అభివృద్ధి, అంబర్‌పేటలో మొక్కజొన్న బ్రీడింగు పథకాల క్రింద షెడ్డు, ఆఫీసు-లేబొరేటరీ నిర్మాణం. దిండి షెడ్యూలులోని భూసార పరిశోధన కేంద్రంలో పని చేపట్టబడుతున్నది.

## పారిశ్రామిక గృహ వసతి

విజయవాడలో రూ 10.31 లక్షలతో 300 యిళ్లు నిర్మించబడ్డాయి. నీరు, విద్యుచ్ఛక్తి మాత్రం యింకా సుఫలా కావడం లేదు. దిగువ పనులు జరుగుతున్నాయి: రాజమండ్రిలో రూ. 3.30 లక్షలతో 100 యిళ్ల నిర్మాణం, గూడూరులో రూ, 1.65 లక్షలతో 50 యిళ్ల నిర్మాణం,



నల్గొండ హరిజన వసతిగృహం (14.10.58 న ముఖ్యమంత్రిచే ప్రారంభింప బడింది).

ఆదోనిలో రూ. 3.30 లక్షలతో 100 యిళ్లు, విజయవాడలో రూ, 0.94 లక్షలతో కార్మిక సంక్షేమ కేంద్రం నిర్మించబడుతున్నవి.

## చిన్నతరహా పరిశ్రమలు

శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, కడప, కర్నూలులలో కమ్మరం, వడ్రంగాలలో వుత్పత్తి-శిక్షణా కేంద్రాలు, వైజాగ్‌లో వడ్రంగం కేంద్రాల పనులు కొనసాగుతున్నాయి. అవి త్వరలోనే పూర్తి కాగలవని భావించబడు తున్నది. ఇంకా దిగువ పనులు కొనసాగుతున్నాయి: రాజమండ్రిలో సుద్ద పల్లల తయారీ, గ్రామాఫైలో పరిశ్రమకై వుత్పత్తి శిక్షణా కేంద్రం స్థాపన, ధవళేశ్వరంలో హార్డువేర్ ఫ్యాక్టరీకి భవన నిర్మాణం, తాడేపల్లి గూడెం, గూడూరు, కడపలలో సాధారణ ప్రయోజన ఇంజనీరింగు వర్క్‌షాపుల స్థాపన, విజయవాడలో అచ్చుల కేంద్రం, సైకిలు విడిభాగాల తయారీ కేంద్రం, మోడల్ తోలు వస్తువుల తయారీ కేంద్రం, గుంటూరులో యెనామిలు వస్తువుల తయారీ శిక్షణా వుత్పత్తి కేంద్రం, గుంతకల్లులో మోడల్ తోలు పదును సంస్థ, కరీంనగరంలో కత్తుల పరిశ్రమ అభివృద్ధి పథకం, వరంగల్లు, మహబూబాబాదులలో మోడల్ వడ్రంగం పనులు, వరంగల్లులో రంపం మిల్లు-కలప సీజనింగు ప్లాంటు, ఖమ్మంమెట్టులో మోడల్ స్మితీ, వరంగల్లులో మోడల్ కమ్మరం కేంద్రాలు, సామర్లకోటలో తాటి బ్రష్‌ల తయారీ పథకం, హైదరాబాదులో విద్యుత్తుతో నడిచే చిన్న యంత్రాలలో శిక్షణ నిచ్చే పథకం పూర్తి అయినవి.

## భారీ పరిశ్రమలు

రాజమండ్రిలో రూ. 1.07 లక్షలపై ఆంధ్ర కాగితం మిల్లుకి, తిరుపతిలో రూ. 1.12 లక్షలపై శ్రీ వెంకటేశ్వర కాగితం, స్ట్రాబోర్డు మిల్లుకి భవనాలు నిర్మించబడు తున్నాయి. గూడూరులో రూ 3 80 లక్షలతో పింగాణీ ఫ్యాక్టరీకి భవనాలు నిర్మించ బడ్డాయి,

## పారిశ్రామిక కేంద్రాలు

విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోటలలో వరుసగా రూ. 30.65 లక్షలు, రూ. 20.00 లక్షలు, రూ. 7.00 లక్షలపై పారిశ్రామిక కేంద్రాల స్థాపనకై పని జరుగుతున్నది.

## సిల్కు పరిశ్రమ పథకాలు

హిందూపురంలో గ్రానియేజ్, బేసిక్ ఫారమ్, ప్యాపలిలో ప్రయోగాత్మక యెగిసీడ్‌ల స్థాపన పూర్తయింది. పలమనేరులో ప్రస్తుత ప్రభుత్వ సిల్కు ఫారమ్‌కి సౌకర్యాలు కలిగించ బడినవి. దిగువ పనులు కొనసాగుతున్నాయి: వరంగల్లులోని ప్రభుత్వ సిల్కుఫారమ్‌ను, వరంగల్లు జిల్లా వెంకటాపురంలోని టస్సర్ సీడ్ కేంద్రాన్ని బలపరుచుట, నిజామాబాదు జిల్లా బికనీర్‌లో బేసిక్ సీడ్ కేంద్రం స్థాపన.

## పశుపోషణ వగైరా

వైజాగ్‌లో ఓవర్‌హెడ్ టాంకు, వెయిటింగ్ అండ్ డ్రెస్సింగు షెడ్డు, యెమర్జెన్సీ కాలేజీలో రెండవ జట్టు విద్యార్థులకు అదనపు వసతి, అదనపు లెక్చర్ హాలు, పాలుపితుకుటకు అదనపు శాల, క్లినికల్ లేబొరేటరీ వంటి పథకాలు పూర్తి అయినవి. దిగువ పనులు కూడా పూర్తి అయినవి: నెల్లూరు, కర్నూలులో క్లినికల్ లేబొరేటరీ నిర్మాణం, ఆర్. మల్కనూరు, ఏలగడ, మహబూబునగరాలలో గొఱ్ఱెలు, వున్ని అభివృద్ధి కేంద్రాలు, ప్రింగారంలో ఫిష్ ఫారమ్. దిగువ పనులు జరుగుతున్నాయి: విశాఖ పాడి పరిశ్రమ కేంద్రంలో వసతిగృహాల నిర్మాణం, రాజేంద్ర నగర్‌లో ఎమర్జెన్సీ 2 సంవత్సరాల డిప్లమో కోర్సుకి వసతి గృహాలు వగైరా, సంగారెడ్డిలో పశు వైద్యశాల, వైజాగ్, హైదరాబాదులలో కోల్డు స్టోరేజిలు. పథకాలు మంజూరైన చోట పని ప్రారంభించుటకు చర్య గైకొన బడుతున్నది. ఆ పథకాలు ఇవి: బనవాసి, పలమనేరులలో పశువుల క్షేత్రం, తిరుపతిలో పశు వైద్య కళాశాల, చింతలదేవిలో పశు పరిశోధన కేంద్రం, 10 ప్రదేశాలలో కోడి పరిశ్రమ పైలట్ ప్రాజెక్టులు.



రాజేంద్రనగర్ వ్యవసాయ క్షేత్రం

# రాజేంద్రనగర్‌లో వరి పరిశోధన

ఎకరా ఉత్పత్తి ముఖ్యంగా సాంకేతిక సమస్య అని దేశంలో ఆహార పరిస్థితిపై మాట్లాడుతూ యిటీవల ప్రధాన మంత్రి అన్నారు. రాజేంద్ర నగర్ వ్యవసాయ పరిశోధక సంస్థలో జరిగే వరి పరిశోధన వల్ల ఆమాట కొంత వరకూ నిజమని తేలింది.

1950-51 లో సంయుక్త రాజ్యాల ఆహార, వ్యవసాయ సంస్థ కటక్‌లోని కేంద్ర వరి పరిశోధన సంస్థలో అంతర్జాతీయ వరి మిశ్రమం ప్రాజెక్టును ప్రారంభించింది. అక్కడ కొన్ని జపాను రకాలు, ఇండియా, బర్మా, సింహళం, ఇండోనేసియా, ఫిలిప్పైన్సు మున్నగు దక్షిణ, ఆగ్నేయ ఆసియా దేశాల మేలిరకం వరి రకాలతో మిశ్రమం చేయబడినవి.

పై దేశాల వరి రకాలకి ఎక్కువ రసాయన ఎరువులను వేసినట్లయితే మొక్క ఏపుగా పెరిగి ఎక్కువ ఆకులను వేస్తుంది, ధాన్యం తక్కువగా పండుతాయి. ఈ ప్రాజెక్టులోను, ఆ తరువాత భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం ప్రారంభించిన ప్రాజెక్టులోను కూడా ఆంధ్రప్రదేశ్ చురుగ్గా పాల్గొన్నది. తత్ఫలితంగా ఆంధ్రప్రదేశ్ రకాలు 8, వివిధ పద్ధతులలో 12 జపాని రకాలతో మిశ్రమం చేయబడినవి. ఈ మిశ్రమ రకాలు ముఖ్యంగా రాజేంద్రనగర్ వ్యవసాయ పరిశోధన సంస్థలో గడచిన 11 వ్యవసాయ ఋతువులనుంచి వరుసగా పండించబడు తున్నాయి. ఈ మిశ్రమ రకాల పంటలో ముఖ్యమైన తేడా ఏమిటంటే



పంటకొచ్చిన పైరు: కొత్త మిశ్రమ వరి రకాలలో ఒకరకం.

రసాయన యెరువు మోతాదు మామూలు 30 నత్రజని + 15 పి$_2$ ఓ$_5$ రెట్టింపు చేయబడి 60 నత్రజని + 30 పి$_2$ ఓ$_3$ కి మార్చబడింది. అసలు రకాల కంటె యీ మిశ్రమ రకాల నాణ్యాం యెంత యెక్కువో తెలుసు కొనుటకై ఆంధ్రప్రదేశ్ అసలు రకాలు వాటి పక్కనే పెంచబడ్డాయి.

యీ మొక్కలు యెన్నాళ్లకు పంటకు వస్తాయో, యెంత యెత్తు పెరుగుతాయో, గడ్డి యెలావుంటుందో, గింజ నాణ్యా మెటువంటిదో అన్నిటికిమించి యెంతపంట పండుతుందో తెలుసు కొనుటకై యీ కాలంలో కొన్ని లక్షల మొక్కలు విడిగాను, సాముహికంగాను కూడా పరిశీలించ బడినవి. ఈ ఆబీ వ్యవసాయ ఋతువులో యీ మిశ్రమరకాలు అసలు ఆంధ్రప్రదేశ్ రకాలకంటె మంచివని ఋజువైనది. అసలు రకాలు స్థానిక రకాలకంటె నాణ్యమైనవిగానే వున్నా యీ మిశ్రమ రకాలకు వరికోతానికి తట్టుకోలేక పోయాయి. వాటికి రసాయన యెరువులు యెక్కువవేస్తే పడలేదుకూడా. మిశ్రమ రకాలలో మిక్కిలి ముఖ్యమైనవి యివి: నోరిన్ 20 × హెచ్. ఆర్. 19-98, హెచ్ ర్ 19 × నోరిన్, 18-43, నోరిన్ 36 × హెచ్. ఆర్. 19-48. ఇందులో కొన్ని వడగళ్ల వానను తట్టుకునే రకాలు కూడా వున్నాయి. వీటన్నిటిలోకి రసాయన యెరువులను యెక్కువగా భరించి యెక్కువ పంట నిచ్చేవి మిక్కిలి ముఖ్యమైనవి. ఇక్కడ జరిపిన పంటల పరిశోధనలో యీ మిశ్రమ రకాలు ఆంధ్రప్రదేశ్ అసలు రకాలకంటె 6 నుంచి 177 శాతం వరకూ యెక్కువ పండుతాయని నిర్థారణ అయింది. ముఖ్యంగా గడచిన మూడు వ్యవసాయ ఋతువుల లోను పండిన యెక్కువపంట సగటు 92 శాతం. ఈ రకాలు వంట విషయంలో భారతీయుల అభిరుచికి అనుగుణంగా వుంటాయి. జపానికా అసలు రకాల గింజలు ముతకగా వుండి వండిన పిమ్మట మెతుకూ మెతుకూ అంటు కుంటాయి. అట్టిరకాలను భారతీయు లెవరూ తినరు. పట్నవాసులు మెతుకూ మెతుకూ అంటుకోని రకం బియ్యంకావాలంటారు.

ఈ విధంగా సంయుక్త రాజ్యాల ఆహార, వ్యవసాయ సంస్థద్వారా జపాను, దక్షిణ, ఆగ్నేయ ఆశియా దేశాలమధ్య సహకారంవల్ల అసలే నాణ్యమైన యీ ప్రాంతం రకాలను అన్ని విధాలా యింకా అభివృద్ధి పరచుట సాధ్యమయింది. ప్రోత్సాహకరమైన యీ ఫలితాలు రాష్ట్రంలోని రైతులకు కూడా తెలియచేయ బడుతున్నాయి. పాత, కొత్త రకాలను స్వయంగా చూసి యేది మంచిదో యేది కాదో తెలుసు కుంటారనే వుద్దేశంతో వారు



మరొక రకం పైరు

రాజేంద్రనగర్ లోని వ్యవసాయ పరిశోధన సంస్థకు ఆహ్వానింప బడుతున్నారు

తాబీ సీజన్‌లో, యీ పు తమ రకాలను రైతుల పొలాల్లో హైఫార్మింగు పరిస్థితులలో వేసి తద్వారా కొత్తరకాల సందేశాన్ని గ్రామాలన్నిటికి వ్యాపింప చేయాలని సంకల్పించ బడింది

త్వరలోనే అంగ్రప్రదేశ్ రైతులు వరి యెకరా పంటను హెచ్చించుకొని యెంతో ఆలోచనతో కూడిన మన ప్రధాన మంత్రి అభిప్రాయాలను బలపరుస్తారని ఆశించవచ్చు

# చాళుక్య-భీమవరం దేవాలయాలు

(డాక్టర్. ఎమ్. రామారావు)

చాళుక్య-భీమవరం గ్రామం తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకాలో వుంది. అది దక్షిణ రైల్వే: బెజవాడ-వాల్తేరు సెక్షన్‌లో సామర్లకోట రైల్వుస్టేషనుకి వెనుకనున్న కాలవ దక్షిణతీరాన వున్నది.

ఈ గ్రామంలో భీమేశ్వరాలయం, యిప్పుడు మాండవ్య నారాయణ అని వ్యవహరించబడే విష్ణుమూర్తి ఆలయం మొత్తం రెండు ఆలయాలున్నాయి. మొదటిది గ్రామంలోపల వుంది. రెండవది దాని దక్షిణాన యించుమించు రెండు ఫర్లాంగుల దూరంలో కాలవగట్టునవుంది. ఈ ప్రదేశం మధ్యయుగంలో కుమారారామం, స్కందారామం అని ప్రసిద్ధికెక్కింది. అప్పుడు అద్వైతులకు పవిత్రమైన పంచారామాలలోను ఒకటిగావుండేది. విష్ణ్వాలయంలోని శాసనాలలో యీ దేవుడు, సకటమంతనినాడులో ప్రోలునాడులో రాజనారాయణ-భీమవరం రాజ-నారాయణ-విన్నగరాళ్వార్ అని పేర్కొనబడింది. పశ్చిమ చాళుక్య పత్రాలు యీ గ్రామం వేంగినాడులో వున్నదని పేర్కొనగా, చాళుక్య—చోళ పత్రాలు అది గోదావరికి వుత్తరాన రాజేంద్ర చోళ-మండలంలో సకటమంతనినాడులో వున్నదని పేర్కొంటున్నవి.

భీమేశ్వరాలయం క్రీ. శ. 19 వ శతాబ్దం చివరి భాగంలో చాళుక్య-భీముడు అనే సుప్రసిద్ధమైన వేంగి చాళుక్యరాజుచే నిర్మించబడింది. మాండవ్య-నారాయణ దేవాలయం తరువాత పునర్నిర్మించబడింది. మొదట యిది రాజ-నారాయణస్వామి అనే విషుమూర్తి ఆలయం. దీనిని దానార్ణవుడు అనే రాజ-నారాయణ నామాంకితుడైన మరొక వేంగీ చాళుక్యరాజు నిర్మించాడు. అతడు క్రీ. శ. పదవ శతాబ్దం వుత్తరార్థంతో లిపాదంలో రాజ్యమేలాడు.

భీమేశ్వరాలయంలో 27 శాసనాలు వున్నాయి. అవి క్రీ. శ. 1223 నుంచి 1494 మధ్యకాలాలకి చెందినవి. మాండవ్యనారాయణస్వామి ఆలయంలో శాసనాలు క్రీ. శ. 1097-1422 మధ్యకాలానికి చెందినవి. ఈ శాసనాలవల్ల యీ దేవాలయాలకి సంబంధించిన విశేషాలెన్నో తెలుస్తున్నవి. దేవాలయంలో భక్తులు ప్రతిష్ఠించిన గిరిజావిగ్రహంగురించీ అనభీమ-లింగ, సోమేశ్వర, సిద్ధేశ్వర నామాంకితాలైన లింగాలను గురించీ, చంద్రశేఖరస్వామి విగ్రహం నాట్యశివుని శిలాప్రతిమగురించీ కేశవదేవుని విగ్రహంగురించీ పేర్కొనబడింది క్రీ. శ, 1422 లో ఒకానొక మంత్రి-సూర్యుడు 8 స్తంభాల రాతి మంటపాన్ని, రెండంతస్తుల ముఖమంటపాన్ని నిర్మించాడు. క్రీ. శ. 1414 లో మరొక భక్తుడు సింహద్వారానికి యెదుట నందిని ప్రతిష్ఠించాడు. ఇవికాక యీ దేవాలయానికి భూమి, కంచుగిన్నెలు, గంటలు, దీపస్తంభాలు, ఆవులు, నిత్యనైవేద్యానికి బియ్యం, నెయ్యి, పెరుగు, తోటలు కానుకగా యివ్వబడ్డాయి. విష్ణ్వాలయంలోని శాసనాలవల్ల నిత్యపూజా సంగీత విద్వాంసులు నాట్యకళాకారులతోసహా దేవాలయ సిబ్బందికి సంబంధించిన ముఖ్య విషయాలు తెలుస్తున్నాయి.

## భీమేశ్వరాలయం

ఇది అన్ని విషయాలలోను ద్రాక్షారామ భీమేశ్వరాలయాన్ని పోలివుంది. దానికి పెద్ద పెద్ద రాళ్ళతో నిర్మించిన ప్రాకారాలు రెండు వున్నాయి గర్భగుడి రెండంతస్తుల స్తంభాల వరండా మధ్యవుంది. మొదటి గోడకి చూరువుంది. అది పైపైవున సాదాగావుంది. కాని లోపలవైపు పద్మపర్ణాలు, పూసలపేరులతో అలంకరించబడింది. ఈ గోడకి నాలుగుదిశలా

నాలుగు ద్వారాలు వున్నాయి. ఇప్పుడు వుత్తర ద్వారం సింహద్వారంగా వుపయోగించబడుతున్నది. బహిర్ప్రదేశంలో పిలాస్టర్స్‌తో అలంకరింపబడిన స్తంభాల మండపం వుంది. దానికి అంతా సిమెంటు చేయబడి రంగు వేయబడింది.

## ఉత్తర ద్వారం

ఈ ద్వారం లోపలి భాగంలో దీర్ఘ చతురస్రంగా వున్న పోర్టికో వుంది. దానిమధ్య ఒక ద్వారం వుంది. అది బహిర్కుడ్యం నుంచి ముందుకు వస్తున్నది. దాని నిర్మాణం, దాని గోడలపై వున్న శిల్పాలు చూడదగినవి.



భీమేశ్వరాలయం. మొదటి ఆవరణ ఉత్తర ద్వారం లోపల యెడమగోడ.

కుడి గోడ పాద తలంపై అడుగునుంచి పైకి యిట్లున్నాయి: ఎ. వెడల్పైన పాదాపట్టీ. బి. రసీడింగ్ ప్లాన్ బాండు, సి. త్రిముఖ పాదా మోల్డింగు, 4.8 అరలు గల రీసెస్. దీనిలో పశ్చిమాన్నుంచి తూర్పుకి 1. పశ్చిమ ముఖంగా వున్న సింహంతో రెండు పద్మాలు. సింహం వెనుక పాదం యెత్తివుంది. 2. కుడి ముఖంగా వున్న సింహం, దాని వెనుక పాదం యెత్తివుంది. 3. రెండు పద్మాలు. 4. రెండు పద్మాలు. 5. ఒక పద్మము, 6. వెనుక పాదం యెత్తి యెడమ ముఖంగా వున్న సింహం, ఒక పద్మం, ముడిచిన మోకాళ్లపై మానవ దేహం గల సింహం, కుడి ముఖంగా వున్న సింహం. ఈ పాద తల. పైన గోడ సాదారాళ్లతో నిర్మించబడింది. దానిలో మధ్య మధ్య 5 స్తంభాగాత్రలున్నాయి. దూలాలు వాటి ఆమలకాల మీంచి ముందుకు వస్తున్నాయి. దీనిపైన అడ్డంగా 15 వాసపు కొనల వరుసవుంది. దీనిపైన పద్మ పత్రాలు గల అంచు వుంది. 1. కాళ్లు ముడుచుకుని యెడమ చేయి నేలమీద వుంచి కుడి చేతిలో యేదో వస్తువును పట్టుకున్న మనుష్యుడు. 2. కీర్తి ముకుటం గల శిఖరం. 3. మొసలి సవారీ చేస్తున్న స్త్రీ పురుషులు. ద్వారానికి పైన గల అంచుపై కీర్తి ముకుటాల వరుస, యెడమ ముఖంగా వుండి ఎడమచేయి జాపి, కుడి చేతిని వురముపై వేసుకొని యెడమ ముఖంగా వున్న హనుమంతుని విగ్రహం, ముందు రెండు పాదాలతోను వేదిపై గల లింగాన్ని పట్టుకుని కుడి ముఖంగా వున్న సింహం వున్నాయి.

ఈ ద్వారానికి యెడమ వైపున వున్న గోడ నిర్మాణంలో కుడి గోడవలెనే వుంది. దాని అంచుపై దిగువ శిల్పాలు వున్నాయి. 1. కుడి చేతిలో కత్తితో, యెడమ చేతిని పైకెత్తి వున్న స్త్రీ. 2. ఎడమ కాలును స్వల్పంగా వంచి, కుడి కాలును



భీమేశ్వరాలయం-కాలభైరవాలయం

మోకాటి వద్ద వంచి పైకి యెత్తి పాదాన్ని కుడి తొడతో సమానంతరంగా వుంచి కుడి చేతిలో వెన్న ముద్దతో, యెడమచేతిని క్రిందికి వేళ్లాడ వేసుకుని నాట్యం చేస్తున్న కృష్ణుడు. 3. యాలిదేహంతో పై చేతులను యెత్తి క్రింది రెండు చేతులతోను వీణ పట్టుకుని యెగిరే స్త్రీ. 4,5 కీర్తి మకుటాలు.

## కాల భైరవాలయం

పైన వివరించిన ద్వారం దాటితే దేవాలయం మొదటి ఆవరణ వస్తుంది. ఆవరణ వాయవ్య మూల గల చిన్న గుడి కాల భైరవునిది. ఈ గుడి పాద తలంపై మూడు బల్లపరుపు పట్టీలు వాటి మధ్య రెండు సాదా అరలు వున్నాయి. పై గోడలు సాదాగా వున్నాయి. 6 స్తంభాగ్రాలు వున్నాయి. వాటిపైన అడ్డంగా వాసపు కొనల వరుస వుంది. పైన గళ అంచు 6 అర్ధచంద్రాకార దిమ్మలతో అలంకరించబడింది. ఈ ఆలయం విమానం కర్ణ కుడులా వుంది. ఇది సాలతోను కర్ణకుడుల తోను అలంకరించబడింది. కర్ణకుడుల పై కీర్తి మకుటాలు గల శిఖరాలున్నాయి. వాటిపైన బల్ల బరుపుగా సన్నంగా వున్న ప్రదేశంలో నాలుగు మూలల నంది విగ్రహాలు వున్నాయి. ఈ ఆలయం తూర్పు ద్వారం సాదాగా వుండి, రెండు స్తంభా లతో చేయబడింది. ఇక్కడినుంచి సెల్లాలోకి తోవ వుంది. అక్కడ పాద తలాన ద్వార పాలకులు వున్నారు. దానిపై దూలం మీద మధ్య భైరవుడు, ఆయన కిటూ అటూ స్త్రీ, పురుష భక్తులు వున్నారు. సెల్లా మధ్యలో భైరవుని విగ్రహం వుంది.



భీమేశ్వరాలయం - మరొక దృశ్యం.

## తూర్పు ద్వారం

మొదటి ప్రాకారి తూర్పున విశాలమైన ద్వారం ఒకటి వుంది. ఆవల మంటపం ఒకటి వుంది. ఇది ఒక చెరువుకి యెదురుగా వుంది. ఆ చెరువు మధ్య ఒక చిన్నమండపం వుంది. ఈ ద్వారానికి మిక్కిలి సమీపంలో యోనిలో ఒక పెద్ద లింగంవుంది.



భీమేశ్వరాలయం - మొదటి ఆవరణ వాయవ్యదిశలోగల మండపం.

## పశ్చిమ ద్వారం

నిర్మాణంలో యిది తూర్పు ద్వారాన్ని పోలి వుంది. ఈ ద్వారానికి కుడి వైపున గోడ లోపలి వైపున గూటిలో చక్కని గణపతి విగ్రహం వుంది. రెండు స్తంభాగ్రా మధ్యగల దీనిపై కీర్తి మకుటం వుంది. గోడ కావల ద్వారానికి యెదురుగా యెత్తయిన వేదిక వుంది. దానిపై పొడుగుపాటి రాతి స్తంభము, దానిపైన నంది వున్నాయి.

## మండపం

మొదటి ప్రాకారం వాయవ్య మూలలో 66 స్తంభాల పెద్ద మండపం వుంది, దీని మధ్యలో విచిత్రమైన స్తంభం ఒకటి వుంది. దాని పాద తలాన సింహం, దాని పైన నలు చదరంగా వున్న దిమ్మ, దానిపై కీర్తి మకుటాలతో నిండిన ఆకారం,



భీమేశ్వరాలయం—లోపలిగోడలో ఒక భాగం.

దానిపై రెండు పద్మాలు, అన్నిటికి పైన అష్ట కోణాల బోదె వున్నాయి. ఈ మండపం వుత్తరం చివర చిన్న వసారా వుంది. దానిముందు రెండు స్తంభాల అడుగు భాగంలో సింహాలు వున్నాయి.

## రెండవ ప్రాకారం

మొదటి, రెండవ ప్రాకారాలను విడదీసే లోపలి గోడ పెద్ద పెద్ద రాళతో నిర్మించబడింది. అది ద్రాక్షారామ దేవాలయం లోపలి గోడలా రెండు విభాగాలుగా వుంది. క్రింది విభాగంలో మధ్య మధ్య స్తంభాగ్రాలు వాటిపై కీర్తి ముకుటాలు గల శిఖరాలున్నాయి. వాటి పైన అడ్డంగా వాసపు కొసల వరుస దానిపై పల్లపు అంచు వున్నాయి. ఈ విభాగం పైన అట్టిదే మరొకటి నిర్మించబడింది. ఈ లోపలి గోడ నాలుగు కోణాలలోను కుడువంటి విమానాలు వున్నాయి. ఈ లోపలి గోడలో దక్షిణ, పశ్చిమ, వుత్తర దిశల రెండంతస్తుల ద్వారాలు వున్నాయి.

ఈ లోపలి ప్రాకారంలో చుట్టూ రెండంతస్తుల వరండా వుంది. దాని ముందు భాగంలో స్తంభాల వరుస వుంది. ఈ వరండా తూర్పు ద్వారంముందు యెక్కువ వెడల్పుగా వుంది. అక్కడ చక్కగా మలచబడిన నంది వుంది. ఈశాన్య, వాయవ్య మూలల్లో రెండు చిన్న మండపాలున్నాయి. ఈ వరండా వెనక గోడలో చిన్న చిన్న అలయాలు 14 వున్నాయి. అక్కడ చక్కని విగ్రహాలు వున్నాయి. ప్రధాన అలయంకింద అంతస్తు ద్వారానికి దక్షిణాన ఒక చిన్నసైజు అలయం వుంది.

## చిన్నసైజు ఆలయం

ఇదొక తిన్నెపై పెట్టబడింది. ఎడమవైపున గణపతి విగ్రహం వుంది. ఈ ఆలయం పాదతలంపై అరలలో శిల్పాలున్నాయి. ముందరి లేక తూర్పు భాగంలో 3 అరలు వున్నాయి. మధ్య అరలో విగ్రహాలు శిథిలమై పోయాయి. ఇటుఅటూ వున్న అరలలో పిల్లన గ్రోవి, మృదంగం, తాళాలు వాయించే పురుషులు వున్నారు. దక్షిణం వైపు పాదతలంపై ఒక పురుషుడు-ఎడమకాలు ముడుచుకుని, కుడికాలు యెత్తి వున్నాయి. కుడిచేతిలో బాకు వుంది. ఎడమచేయి యెడమ తొడపై వుంది.



భీమేశ్వరాలయం.—లోపలిగోడలో గణపతి విగ్రహం.



భీమేశ్వరాలయం— రెండవ ఆవరణలో ఒక గుడి.

ఎడమ చేతిలో కమండలాలు గల యిద్దరు ఋషులు, యిద్దరి పురుషుల మధ్యవున్న స్త్రీ, కమండలాలతో యిద్దరు మునులు వున్నారు.

ఈ ఆలయం ముందు గోడమధ్యలో సాదా ద్వారం ఒకటివుంది. అటు ఇటూ ద్వారపాలకులు-కాలిమీద కాలువేసుకుని-నిలబడి వున్నారు. వారి పై కుడిచేతిలో ఢమరు, పై యెడమచేతిలో నాగము వున్నాయి. క్రింది కుడిచేయి గదపైవుంది. క్రింది యెడమ చేతులు అభయముద్రలో వున్నాయి. దక్షిణపు గోడలో నాలుగు అరలు వున్నాయి. అక్కడ నిలబడివున్న గణపతి విగ్రహం, యేనుగ సవారీ చేసే దేవుడు, ఆరు తలలు, 12 చేతులు గలిగి ఆయుధాలు ధరించిన కుమారస్వామి, ఏనుగమీద



భీమేశ్వరాలయం—రెండవ ఆవరణ ఈశాన్య దిశలో మండపం

కూర్చున్న దేవుడు విగ్రహాలు వున్నాయి. ఉత్తరపు గోడలో గల నాలుగు అరలలోను 1. చతుర్భుజుడు, 2. కుడిచేతిలో పరశువుతో యెడమ చేతిని యెడమ తొడపై వేసుకుని పద్మాసనంలో కూర్చున్న దేవుడు, 3. అష్టభుజ వీరభద్రస్వామి, ఆయన కుడి వైపున నిల్చున్న దక్షుడు.

ఈ అరలకు చుట్టూ పైన సాదా బల్ల పరుపు పట్టీవుంది. పై కట్టడానికి ఆపుగావున్న ద్వారాలు దానిపై వున్నాయి. దానిపైన అచ్చు పోయబడిన అంచువుంది. అది కీర్తిమ కుటాలుగల శిఖరాలతో



భీమేశ్వరాలయం-ప్రధాన ఆలయం గోడలు

అలంకరించ బడింది. దీనిపైన జాతుల వరుసగల మరొక సన్నటి గట్టు వుంది.

ఈ దేవాలయం విమానం మీద అనేక వరుసల అలంకారాలు, శిల్పాలు వున్నాయి. మొదటి లేక అడుగు వరుసలో తూర్పున మూడు అరలు వున్నాయి. వాటిలో 1. ఎద్దుసవారీచేస్తున్న చతుర్భుజుడు, 2. నాట్యం చేస్తున్న శివుడు, ఆయన కుడి కాలు వంగి అపస్మార పురుషునిపై వేసివుంది. ఎడమకాలు భుజంగత్రాస భంగిమలో పక్కకి వెళ్ళింది. పై రెండు చేతులలోను ఆయుధాలు వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలో వుండగా క్రింది యెడమచేయి కరిహస్తంలో వురము పైకి వచ్చివుంది. 3. చేతిలో ఖడ్గంతో యేనుగ సవారీ చేస్తున్న దేవుడు. దక్షిణాన 1. చేతితో ఖడ్గంతో ఏనుగ సవారీ చేస్తున్న దేవుడు, 2. గజా



భీమేశ్వరాలయం—మొదటి అంతస్తుద్వారం

సుర సంహారమూర్తి 3. కుడిచేతిలో ధ్వజంతో జంతువుపై సవారీచేస్తున్న దేవుడు. విమానం రెండవ వరుస చుట్టూ బల్ల పరుపు గట్టువుంది. మూడవ వరుసలో మధ్య మధ్య కురుచ స్తంభాగ్రాలున్నాయి. ఆ తరువాత ఒక సాదాభాగం, దానిపైన రీసెస్ వున్నాయి. ఆ పైన సన్నటి పట్టీపై నాలుగు మూలల నంది విగ్రహాలు వున్నాయి. కుడు-వంటి భాగం యీ పట్టీలో కొంచెం లోపలగావుంది. దాని నలుముఖాలగల శిఖరంలో కూర్చున్న దేవుడు వున్నాడు. మధ్యలో కలశం వుంది.

## ప్రధాన ఆలయం

చాళుక్య-భీమేశ్వరాలయం రెండవ ప్రాకారం మధ్యవుంది. అది రెండంతస్తుల కట్టడం. పాదతలం సాదాగావుంది. రెండు రీసెస్‌లు, మూడు సాదా బల్లపరుపు ప్రదేశాలు వున్నాయి. పైన గోడలకి దూరదూరంగా స్తంభాగ్రాలున్నాయి. వాటిపైన వాసపుకొసల వరుస, దానిపై సన్నటి అంచు వున్నాయి. ఈ అంచుపైన అదేరకంగా గోడ మరొక విభాగం నిర్మించబడింది. ఒక్కొక్క-గోడ దిగువ విభాగం మధ్యలో నలుచదరపుగూడు వుంది. దానికి జల్లెడ తెరవుంది. దానిగుండా లోపలనున్న సెల్లాలోనికి గాలి, వెలుతురు ప్రవేశిస్తాయి. గోడ పై విభాగంలో నాలుగు వెలుతురు గూళ్లున్నాయి. వాటిగుండా సెల్లా పై అంతస్తుకి గాలి, వెలుతురు వెడతాయి.

క్రింద అంతస్తులో ఆలయానికి ముందు సన్నటి మండపంవుంది. దానిమధ్య ఒక ద్వారం యిటూ అటూ నాలుగేసి స్తంభాల రెండు సన్నటి గదులు వున్నాయి. నేలపై మధ్య నంది వుంది. ద్వారానికిటూ అటూను, సన్నటి గది గూటిలోను ద్వారపాలకుడు వున్నాడు. ద్వారం పాదతలాన ఒకదానికొకటి అభిముఖంగా రెండు సింహాలు వున్నాయి. వాటి పైన ద్వారపాలకులు వున్నారు. వారిచేతిలో నాగము, త్రిశూలము, గద వున్నాయి. పైన మూడు వరుసల స్క్రోల్ పని వుంది. ద్వారబంధం పై భాగాన రెండు చేతులతోను పద్మాలతో పద్మాసనంపై కూర్చున్న గజలక్ష్మి విగ్రహంవుంది. ఆమె కిరుపక్కలాగల ఏనుగులు ఆమెపై నీరు జల్లుతున్నాయి.

ఈద్వారానికి ఆవల నాలుగు విభాగాలున్నాయి. ఒక్కొక్కదానికి సాదాద్వారంవుంది. వీటిలో రెండవదానివద్ద పాదతలాన ద్వారపాలకులు వున్నారు.



భీమేశ్వరాలయం-ప్రధాన ఆలయంపై విమానం

ఆలయంమధ్య సెల్లాకి మూడువైపులాగల జల్లెడ తెరలనుంచి బాగా వెలుతురు వస్తుంది. దానిమధ్య ఒక సాదావేదవుంది. దానిపై ఒక పొడుగాటి లింగంవుంది. అది అష్టకోణాకృతిలో వుంది.

## ప్రధాన ఆలయం - పై అంతస్తు

ఆలయానికి యెదుట క్రింద అంతస్తు మండపం వెనుక యిరువైపులా సన్నటి గుమ్మాలు రెండు వున్నాయి. ఈ గుమ్మాలవెనుక మెట్లమీదుగా వెడితే ఆలయం పై అంతస్తు చేరవచ్చు. ఈ అంతస్తులో ముందర స్తంభాల వరండా, దాని ఆవల ఒక మండపం, దాని పశ్చిమాన ముందు గది, సెల్లా వున్నాయి. ముందు వరండా వుత్తర, దక్షిణాల అగు స్తంభాలు వునాయి. సెల్లాలో లింగానికి యెదురుగా మధ్యలో చక్కని నందివుంది. దాని ముందు జత పాదుకలు వున్నాయి. ఈ వరండా పడమరకొసని ఒకగోడ, దానికి ఒక గుమ్మం వున్నాయి. ఈ గుమ్మం అడుగుభాగాన చక్కని ద్వారపాలకులున్నారు. ద్వారబంధం పైభాగాన

గజలక్ష్మి విగ్రహంవుంది. ఈ వరండా ఆవల సన్నటి మండపం వుంది. దానికిటూ అటూ మూడేసి స్తంభాలు వున్నాయి. ఈ స్తంభాలకి వుత్తర, దక్షిణాల ఒకతోవవుంది. అక్కడినుంచి మెట్లు మేడపైకి వస్తాయి.

ఈ మంటపాని కావల ముందు గది, సెల్లాలచుట్టూ తిరిగే ప్రదక్షిణంవుంది. ఈ ప్రదక్షిణానికి దక్షిణ, పశ్చిమ, వుత్తర దిశల మూడు బహిరంగ ద్వారాలు వున్నాయి. ఈ ద్వారాలుగల బహిర్కుడ్యానికి, ముందుగది, సెల్లాలకి, మధ్య శిల్పంచెక్కిన స్తంభాల వరుసవుంది.

ముందర లేక తూర్పునగల ఆ స్తంభాల వరుసకు ఆవల ముందు గదివుంది దానికి గుమ్మంవుంది. ఈ గది సన్నగా, సాదాగావుంది.

దాని పశ్చిమ కుడ్యం ద్వారంగుండా సెల్లాలోకి వెళ్లవచ్చు ఆ సెల్లాకి దక్షిణ పడమర, వుత్తరదిశల మరి మూడు గుమ్మాలు వున్నాయి. వాటిగుండా లోపలికి గాలి, వెలుతురు వస్తాయి. ఈ సెల్లా మధ్యగా విశాలమైన వేదికవుంది, దానికిప్పుడు సిమెంటుచేసి రంగువేశారు. ఈ వేది మధ్యక్రింద అంతస్తులో ప్రతిష్ఠించ బడిన అష్టకోణాకృతి లింగం పై భాగం వుంది. ఈ లింగానికి వుత్తరాన పార్వతీ విగ్రహం వుంది.

## విమానం

ప్రధాన ఆలయం విమానం సాధాగా వుంది. దానిపై యెట్టి శిల్పాలు మలచ బడలేదు. దానిలో క్రిందినుంచి పైకి దిగువ వరుసలు వున్నాయి. 1. మూడు స్తంభాగ్రాలు, ఖాళీస్థలం, మూడు స్థంభాగ్రాలు. 2. సన్నటి సాదాబల్లపరుపు పట్టీ 3. సాదా కోసుపట్టీ 4. బాతుల వరుస 5. సాదా కోసుపట్టీ 6. ఆరు అర్ధ చంద్రాకార దిమ్మలవరుస 7. రీసెస్ 8. మూడు బల్లపరుపు పట్టీలు 9. కర్ణకుడు స్తంభం సాల, స్తంభం, కర్ణకుడు. వీటన్నిటికిపైన కీర్తి మకుటాలు వున్నాయి. 10. రెండు స్తంభాగ్రాలపై కర్ణకుడు, రెండు స్తంభాగ్రాలపై సాల, రెండు స్తంభాగ్రాలపై కర్ణకుడు 11. నాలుగు మూలల నంది విగ్రహాలుగల బల్లపరుపు పట్టీ 12. వేర్లాడే పద్మకోరకాల వరుస 13. మూడు పద్మాలు 14. కలశం.

## శిల్పాలు

భీమేశ్వరాలయంలో దర్శనీయమైన కొన్ని శిల్పాలు వున్నాయి. లోపలి గోడపై వున్నవి యివి:

1. పద్మంపై కూర్చున్న గణపతి.
2. హనుమాన్.
3. నాట్యంచేసే విగ్రహం. ఎడమకాలు యెత్తి వుంది. కుడిచేతిలో గద వుంది. ఎడమచేతిలో విల్లు వుంది.
4. మోకాళ్లు పైకి వచ్చేలా కాళ్లు ముణుచుకుని తిష్టవేసిన స్త్రీ.
5. కాళ్లు యెడుంగావుంచి వింటిలో బాణం నంధిస్తున్న పురుషుడు.
6. పెద్ద పొట్టగల మరుగుజ్జు. కుడిచేతిని ముణిచిన యెడమచేతిపై వేసుకుని నిలుచున్నాడు.
7. మన్మధ క్రీడలోనున్న స్త్రీ పురుషులు.
8. అంజలి ఘటించి పద్మాసనంలో కూర్చున్న పురుషుడు.
9. నగ్నంగా నిలబడిన స్త్రీ.
10. ఎలుకమీద కూర్చున్న గణపతి.

## విగ్రహాలు

ఈ దేవాలయంలోగల 14 చిన్న గుడులలోను దిగువ విగ్రహాలు వున్నాయి :-

లోపలి ఆవరణ దక్షిణవరండా వెనుక గోడలో నిర్మించిన ఆలయాలలో:—

1 సూర్యుడు : సమ భంగంలో నిలుచున్నాడు రెండు చేతులలోను ఒక్కొక్క పద్మం వుంది. కీర్తి మకుటం, మకర కుండలాలు, 3 కంఠ హారాలు, చన్న వీర, వుదరబంధం, మధ్య కీర్తి మకుట పట్టీ గల కటిసూత్రం ధరించాడు.

2 గణపతి : పద్మంలో కూర్చున్నాడు. క్రింద యెలుక వుంది. రెండుకాళ్లు మణిచి పెద్ద పొట్ట పక్కలపై మోపాడు, పై కుడి చేతిలో పరసుపు, పై యెడమ చేతిలో త్రిసూలము, క్రింది కుడిచేతిలో దంతము వున్నాయి. క్రింది యెడమ చేయి పొట్టకి తగిలేలా వ్రేలాడవేసి వుంది. తొండం యెడమ వైపుకు వంగివుంది. పొట్టపై యజ్ఞోపవీతం, నాగబంధం వున్నాయి.

3 సప్త మాతృకలు : 1. బ్రాహ్మి—కుడి కాలు ముడుచుకుని, యెడమకాలు క్రిందికి వ్రేలాడ వేసుకుని కూర్చుని వుంది. మూడుతలలు వున్నాయి. 2. పై బ్రాహ్మి వలెనే కూర్చుని వుంది. పై కుడి చేతిలో త్రిశూలము, పై యెడమచేతిలో అక్షమాల వున్నాయి. క్రింది కుడి చేయి అభయ ముద్రలో వుంది. క్రింది యెడమ చేయి యెడమ మోకాలిపై వుంది. 4. ఈమె పై కుడిచేతిలో పత్రము, పై యెడమ చేతిలో స్తంభం పై గల పక్షి వున్నాయి. క్రింది కుడి చేయి అభయముద్రలో వుంది. దిగువ చిలుక లేక నెమిలి లాంఛనం వుంది. 5. వరాహి—పై కుడి చేతిలో కుంతము, పై యెడమ చేతిలో అక్షమాల వున్నాయి. క్రింద కుడిచేయి అభయముద్రలోను, క్రింద యెడమ చేయి యెడమ మోకాటిమీదా వున్నాయి. దిగువ వరహాలాంఛనంవుంది. ఈ దేవి పై కుడి చేతిలో యేదో వస్తువు, పై యెడమచేతిలో పరశువు వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలోను, క్రింది యెడమచేయి యెడమ మోకాటిమీద వున్నాయి.

4 కుడికాలు మణుచుకుని, యెడమ కాలు మోకాలుపైకి వచ్చేలా ముణుచుకుని కూర్చుని వున్న యీ దేవుని పై కుడిచేతిలో త్రిశూలము, పై యెడమచేతిలో అక్షమాల వున్నాయి. క్రింది రెండు చేతులలోను వీణవుంది.

5 వ్యాఖ్యాన-దక్షిణామూర్తి-ఎడమ కాలుముణుచుకుని, కుడికాలును క్రిందికి వ్రేలాడవేసుకుని కూర్చున్నాడు. పై కుడిచేతిలో శూలము, పై యెడమచేతిలో అక్షమాల వున్నాయి. క్రింది యెడమచేయి చిన్ముద్రలో వుంది. క్రింది యెడమ చేతిలో పుస్తకంవుంది. జటామకుటము, యజ్ఞోపవీతము, వుదరబంధము వున్నాయి.

6 బ్రహ్మ: సమభంగంలో నిలచివున్నాడు పై కుడి చేతిలో అక్షమాల, పై యెడమచేతిలో కమండలం, క్రింది యెడమచేతిలో దండం వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలో వుంది. మూడు తలలు వున్నాయి. మకరకుండలాలు, యజ్ఞోపవీతం, వుదరబంధం ధరించాడు.

పశ్చిమానగల వరండాలోని ఆలయాలలో :—

7 సరస్వతి : పద్మపీఠంపై పద్మాసనంలో కూర్చుని వుంది. పై కుడిచేతిలో అక్షమాల, పై యెడమ చేతిలో వీణ, యెడమ మోకాటపైనున్న క్రింది యెడమచేతిలో పుస్తకము వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోవుంది. కీర్తిమకుటము, రెండు కంఠహారాలు ధరించింది. కుచబంధము, యజ్ఞోపవీతము, మకరకుండలాలు ధరించింది.

8 లింగం : గోడకానివున్న చిన్న ఆలయంలో.

9 కుమారస్వామి : సమభంగంలో నిలబడివున్నాడు. వెనుకపక్క నెమలివుంది. పై కుడిచేతిలో శూలము, పై యెడమచేతిలో స్తంభంపైనున్న మయూరం వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలోవుంది. క్రింది యెడమచేయి కట్యావలంబితంగావుంది. మకరకుండలాలు, చన్నవీర, కంఠాభరణాలు, కీర్తిమకుట పట్టీగలకటి సూత్రం ధరించాడు.

10 నాగపలక : గోడకానుకొనివున్న ఆలయంలో.

11 మహిషాసుర మర్దని.

పశ్చిమాన వరండాలోని ఆలయాలలో :—

12 విష్ణుమూర్తి : సమభంగంలో నిలబడివున్నాడు. పై కుడిచేతిలో చక్రము, పై యెడమచేతిలో శంఖము, క్రింది యెడమచేతిలో గద వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలో వుంది. మకర కుండలాలు, కీర్తిమకుటము, యజ్ఞోపవీతము, వుదరబంధము, పాదభూషణాలను ధరించాడు. మధ్య కీర్తిమకుట పట్టీగలకటి సూత్రంవుంది.

13 లక్ష్మి : పద్మాసనంలో కూర్చునివుంది. కుడిచేతిలో పద్మంవుంది. ఎడమచేయి యెడమ మోకాలిపై వుంది.

14 శని : ఎడమకాలు ముణుచుకుని, కుడికాలు క్రిందికి వ్రేలాడవేసుకుని కూర్చునివున్నాడు. పై కుడిచేతిలో పరశువు, పై యెడమచేతిలో అక్షమాల వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోవుంది. క్రింది యెడమచేయి మోకాలిమీద అరచేయి విప్పివేసివుంది, జటలు పక్కలకి యెగురుతున్నాయి. యజ్ఞోపవీతంవుంది. పద్మపట్టీతోకటి సూత్రంవుంది.

15 వీరభద్రుడు : కుడికాలు నిటారుగా వుంచి యెడమకాలును కొంచెం ముందుకుచాచి అపస్మారపురుషునిపై వేసి నిలబడివున్నాడు. పది చేతులు వున్నాయి. పై కుడిచేతులలో త్రిశూలము, ఖడ్గము, పాశము వున్నాయి. నాలుగవది తర్జనిభంగిమలో వుంది. పై యెడమచేతులలో ఢమరు, శంఖము, ధనుస్సు, కపాలము వున్నాయి. క్రింది కుడిచేతిలో ఖడ్గమువుంది. క్రింది యెడమ చేయి పెద్ద డాలుపై వేసివుంది. నాగకుండలాలు, కంఠాభరణాలు, యజ్ఞోపవీతము, వుదరబంధము వున్నాయి. నోరు యిరుపక్కలనుంచి ఒక్కొక్క దంతం వస్తున్నది.

16 దేవసేనుడు ; గోడ కానుకొని వున్న గుడిలో సమ భంగంలో నిలబడి వున్నాడు. పై కుడిచేతిలో త్రిశూలము, పై యెడమచేతిలో నెమలి వున్నాయి. క్రింద కుడిచేయి అభయ ముద్రలోను, క్రింది యెడమచేయి వరద ముద్రలోను వున్నాయి. రెండు పెద్ద హారాలు ధరించాడు. ఒకటి మోకాళ్ల వరకూను, రెండవది పిక్కలమండల వరకూను వున్నాయి. తలకి పైన 5 పాము పడగలు వున్నాయి.

## మాండవ్య-నారాయణస్వామి ఆలయం

కోర్టుయార్డు ; ఈ దేవాలయం సామర్లకోట రైలు స్టేషను వెనుకగల కాలవ దక్షిణ తీరాన ఒక రైల్వే క్రాసింగుకి యెదురుగా వుంది. దాని ప్రహరీ గోడ దాదాపు కాలవకి అంటుతూ వుంటుంది. ఆవరణ తూర్పుగోడకి ఒకద్వారము, దానినంటి ఒక పోర్టికో వున్నాయి. పోర్టికో స్తంభాలు పురాతన మైనవి. దానిపై భాగం ఆధునికంగా నిర్మించ బడింది. ఈ పోర్టికో అవల బహిరంగ స్థలంవుంది. ఇది యిప్పుడు దేవాలయం తోట అని వ్యవహరింప బడుతున్నది. ఈ తోట వుత్తర, దక్షిణ గోడలకి, పోర్టికోకి కుడి, యెడమల గల గోడలకి యెన్నో గూళ్లు వున్నాయి. వాటిలో దిగువ విగ్రహాలు వున్నాయి.

1 విష్ణుమూర్తి, గరుడుడు : విష్ణుమూర్తి విగ్రహం విచిత్రంగా వుంది. గరుడుడు యెగురుతూన్నట్టు వున్నాడు. విష్ణుమూర్తి యెడమకాలు ముణుచుకుని, కుడికాలు క్రిందికి వ్రేలాడ వేసుకుని దాని భుజాలపై కూర్చున్నాడు. ఆయనకు 8 చేతులు వున్నాయి. కుడి చేతులలో చక్రము, ధనుస్సు, ఖడ్గము, పరశువు వున్నాయి. ఎడమ చేతులలో శంఖము మరి రెండు ఆయుధాలు వున్నాయి. నాలుగవది వరద ముద్రలో వుంది. చక్ర కుండలాలు, కుచ్చులకటి సూత్రము, మోకాళ్ల వరకూ వ్రేలాడే హారము ధరించాడు.

2 యోగ నరసింహస్వామి : కాలిమీదకాలు వేసుకుని కూర్చున్నాడు. మోకాళ్లు యోగ పట్టాతో కట్టివున్నాయి. పై కుడిచేతిలో చక్రము, పై యెడమచేతిలో శంఖము వున్నాయి. క్రింది రెండు చేతులు మోకాళ్ల పైకి జాపి వున్నాయి. కీర్తిమకుటం ధరించాడు. చెవులు సింహం చెవులు. నోరు తెరచివుంది. పై పెదవిపై సింహం మీసాలున్నాయి. గెడ్డంక్రింద సింహం జూలువుంది. మోకాళ్లు దిగే పెద్ద హారం ధరించాడు.

3 రావణుడు : ముందు మొహాలు కనబడుతున్నాయి. ఎగురుతూన్నట్టున్నాడు. మొలపటకాలో బాకువుంది. పది చేతులున్నాయి. కుడి చేతులలో, బాకు,కత్తి, వుంగరము, కొరడా, బాకు వున్నాయి. ఎడమ చేతులలో టంక, డాలు, బాకు, మరో వస్తువు వున్నాయి. యెడమ

చేయి తర్జనిలో వుంది. చక్రకుండలాలు, కుచ్చుల కటిసూత్రము, మోకాళ్ల వరకూ గల పెద్ద హారము ధరించాడు.

4 లక్ష్మీ-నారాయణ : పద్మాసనంలో కూర్చున్నాడు. నాలుగు చేతులు వున్నాయి. పై కుడి చేతిలో నలు చదరంగా వున్న వస్తు వేదోవుంది. పై యెడమ చేతిలో కాడగల పద్మంవుంది. క్రింది కుడిచేతిని కుడి తొడపై కూర్చున్న దేవి చుట్టూ వేశాడు. క్రింది యెడమచేయి వరద ముద్రలో వుంది. బాగా అలంకృతుడై వున్నాడు. పత్ర కుండలాలు, వెడల్పు కంఠాభరణం, వుదర బంధం, యజ్ఞోపవీతం, మోకాళ్ల వరకూ వచ్చే హారం ధరించాడు. దేవి రెండు కాళ్లూ వ్రేలాడ వేసుకుని స్వామి కుడి తొడపై కూర్చుని రెండు చేతులను ముందుకు జాపింది. వాటిలో యేదో వస్తువు వుంది.

5 దేవత : ఎడమకాలు ముణుచుకుని, కుడికాలు వ్రేలాడ వేసుకుని కూర్చుని వుంది. పై కుడి చేతిలో పరశువు, పై యెడమచేతిలో అక్షమాల వున్నాయి. క్రింది కుడిచేయి ముష్టి బిగించి వుంది. క్రింది యెడమచేయి యెడమ తొడపై అభయ ముద్రలో వుంది. అరిచేతిలో యేదో గుండ్రని వస్తువు వుంది.

6 దేవుడు : ఎడమకాలు ముణుచుకుని కుడికాలు వ్రేలాడ వేసుకుని కూర్చున్నాడు. కుడిచేయి విస్మయంలో వురముపై వుంది. ఎడమచేయి కూడా విస్మయంలో పైకి యెత్తివుంది. ఆయన వెనుక మరొక దేవుడున్నాడు. పైన ఒకచెట్టు, దానిపై కోతి వున్నాయి. వీరు రామ లక్ష్మణులు, హనుమంతుడు అయివుండవచ్చు.

7 కృష్ణుడు : వేణువు వూదుతున్నాడు. ఒక పక్కన గోవు, మరోపక్కన గోపికా స్త్రీలు వున్నారు.

8 నాట్య గణపతి : దొడ్డి పడమర కొసని మంటపం పిట్టగోడ కానుకొని వుంది. ఎడమకాలు వంగి బొటనవ్రేలు మాత్రం నేలపై ఆనివుంది. కుడి కాలు కుడి తొడకి సమకోణంలో వంగివుంది. పై కుడిచేతిలో పరశువు, పై యెడమచేతిలో పాశము వున్నాయి. క్రింది కుడిచేయి కడుపుపై వుంది. క్రింది యెడమచేయి కరిహస్తంలో వ్రేలాడు తున్నది.

## మండపం

దొడ్డి పడమర సన్నటి మండపం వుంది. దానికి ఆరేసి స్తంభాల వరుసలు 9 వున్నాయి. మండపం మధ్య నలుచదరం వేదికవుంది. దాని నాలుగు మూలల బాగా అలంకృతమైన నాలుగు స్తంభాలు వున్నాయి. ఈ స్తంభాల మీద దూలాలలోపల వైపున పూసల వృత్తాలు వున్నాయి. వాటిలోపల నాట్యకారుల బొమ్మలు వున్నాయి. దూలాలక్రింది పక్కన ఎగురుతూవున్న పొడుగాటి హారంవుంది. అది అమరావతి, నాగార్జునకొండ శిల్పాలలో నున్న కదిలేహారాన్ని పోలివుంది.

## వరండాలు

ప్రధాన ఆలయానికి చుట్టూ బహిరంగ స్థలం వుంది. దానికి దక్షిణ, పడమర, వుత్తరాల వరండాలు వున్నాయి.

## ముందుగది

పైనచెప్పిన మండపానికి పడమరగా నాలుగు విభాగాలతో ముందు గదివుంది. ఒక విభాగంకంటె మరొకటి యెత్తుగావుంది. లోపల సెల్లావుంది. అది మండపంనుంచి సరాసరి కనబడదు.

## సెల్లా

సెల్లాలో విష్ణుమూర్తి విగ్రహంవుంది. శంఖచక్రగదాధారియయిన స్వామి క్రింది కుడిచేయి అభయ ముద్రలోవుంది.

## దేవాలయం కాలం

ఈ దేవాలయం కాలానికి సంబంధించిన సమస్య తెలుసుకోదగినది. దాని ప్రస్తుత స్థితిలో నిస్సందేహంగా అది తరువాత పునర్నిర్మించబడింది. కాని దేవాలయం ముందుగల మండపం స్తంభాలు పురా

తనమైనవి. అవి అదే గ్రామంలోని చాళుక్య-భీమేశ్వరాలయంలోని స్తంభాలను పోలివున్నాయి. తోట గోడల గూళ్ళలోగల విగ్రహాలు మొదటి తూర్పు చాళుక్యపద్ధతికి చెందినవనుటలో సందేహంలేదు. ఇవి ఒకప్పుడు చిన్నరకం ఆలయాలలో ప్రతిష్ఠించబడిన వనుటకూడా నిశ్చయం. ఇదే ప్రదేశంలో రాజనారాయణ దేవాలయం వుండేదన్నమాటకూడా స్పష్టమే. 15 వ శతాబ్దం తరువాత మొదటి యీ రాజనారాయణ దేవాలయం శిథిలమైపోయి, ఆ తరువాత పునర్నిర్మించబడి వుండాలి. మాండవ్య నామాంకితుడైన మునికథను యెవరో కనుగొని ఆలయంలోని నారాయణ విగ్రహంతో దానిని కలిపి దానికి మాండవ్య-నారాయణ అని పేరు పెట్టారు. ఈ దేవాలయంలోని శాసనాల ప్రకారం యీ దేవుని సరైన పేరు రాజనారాయణుడు. ఈ పేరు యీ దేవాలయం కాలాన్ని నిర్ణయించుటకు తోడ్పడుతుంది. కోస్తాజిల్లాలను పరిపాలించిన తూర్పు చాళుక్యరాజులకు దేవళ్లకు తమ పేర్లు లేక బిరుదు పేర్లు పెట్టడం అలవాటు. ఈ వంశపురాజు విజయాదిత్యుడికి నరేంద్రమృగరాజు అనే బిరుదు వుంది. అతడు 108 శివాలయాలను నిర్మించి ఆ దేవళ్ళకి నరేంద్రేశ్వరులు అని పేరుపెట్టాడు. గుణగ-విజయాదిత్యుడనే రాజుకి బిరుదాంకభీముడు అనే బిరుదు వుంది. అతడు బిరుదాంకనవోలు అనే నగరాన్ని నిర్మించాడు. ఇప్పుడు ఆ పేరు భ్రష్టమై బిక్కవోలుగా మారింది. అక్కడ అతడు 6 శివాలయాలను నిర్మించాడు. వాటిలో ఒకదానికి లేక కొన్నిటికి తన పేరును లేక బిరుదు పేరును పెట్టివుంటాడు. తూర్పు చాళుక్యరాజుల యీ అలవాటు దృష్ట్యా, యీ రాజనారాయణ దేవాలయంపేరు యెవరో ఒక చాళుక్యరాజు పేరు లేక బిరుదుపేరు అయి వుండ వచ్చునని అనుకోవచ్చు. క్రీ. శ. పదవ శతాబ్ది ఉత్తరార్థం తొలిపాదంలో రాజ్యమేలిన యీ వంశపు రాజు దానార్ణవునికి రాజనారాయణ అనే బిరుదు వుంది. కాబట్టి యీ దానార్ణవుడు తనముందు రాజ్యమేలిన రెండవ చాళుక్యభీముడు గ్రామంలో స్థాపించిన భీమేశ్వరాలయానికితోడు యీ రాజనారాయణ దేవాలయాన్ని స్థాపించి వుండవచ్చు.



# నల్గొండ జిల్లాలో సమాజాభివృద్ధి

1953 అక్టోబరు 2వ. తేదీన నల్లగొండ జిల్లాలో దేవరకొండ, పెద్దవూర, మిరియాలగూడెం, అనే మూడు బ్లాకులలో సమాజ వికాస కార్యక్రమం ప్రారంభించ బడింది. ప్రతి గ్రామానికి ప్రణాళిక సిద్ధం చేసుకొనుటలో తోడ్పడటం, గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి అనువైన సమన్వయ కార్య క్రమం తయారుచేయటం, యీ ఉద్యమం యొక్క ప్రధానాశయాలు. యిప్పుడు జిల్లాలో బ్లాకుల సంఖ్య 9 కి పెరిగింది. యిందులో 5 ప్రథమదశ బ్లాకులు, మూడు కమ్యూనిటీ అభివృద్ధి బ్లాకులు. ఒకటి, విస్తరణ పూర్వస్థితిలోవున్న బ్లాకు. అవేమంటే.

1. మిరియాలగూడెం సి.డి.బ్లాకు
2. దేవరకొండ ,,
3. పెద్దవూర ,,
4. భువనగిరి పంచాయతీ సమితి బ్లాకు-ప్రథమ స్థాయి బ్లాకు.
5. సూర్యాపేట ప్రథమస్థాయి బ్లాకు
6. నకెరకల్లు ,,
7. చౌటుప్పల ,,
8. చింతపల్లి ,,
9. నారాయణపురం వి.పూ.బ్లాకు.

మిరియాలగూడెం, దేవరకొండ, పెద్దవూర అనే మూడు బ్లాకులను ప్రభుత్వం నాలుగు బ్లాకులుగా పునర్నిర్ణయించటంతో చింతపల్లి ప్రథమ స్థాయి బ్లాకు, నారాయణపురం వి. పూ. బ్లాకు పర్పడినవి. ఈ మార్పు 1958 సెప్టెంబరుతో అంతమైన అర్థ సంవత్సరంలో జరిగింది. ఈ తొమ్మిది బ్లాకులను లెక్కవేసుకుంటే యింతవరకు జిల్లాలో సమాజ వికాసోద్యమం 627 గ్రామాలకు ప్రాకింది. అంటే 2987 చ.మై. విస్తీర్ణంలోగల 62,50,000 జనాభాకు యీ ఉద్యమ ప్రభావం సోకింది. జిల్లా మొత్తంలోని గ్రామాలలో 55 శాతం, గ్రామీణ జనాభాలో 55 శాతం, విస్తీర్ణంలో 55.5 శాతానికి యీ కార్య క్రమాలు వ్యాపించాయి.

## సాధించిన ఫలితాలు

1958 సెప్టెంబరుతో అంతమైన అర్థసంవత్సర కాలంలో యీ కార్యక్రమం ద్వారా వివిధ రంగా లలో సాధించబడిన ఫలితాలు దిగువ పేర్కొన బడినవి :

| | | |
|---|---|---|
| 1. | పంపిణీచేసిన ఎరువులు | 34469 మణుగులు |
| 2. | పంపిణీచేసిన మేలురకం విత్తనాలు | 10.749 ,, |
| 3. | జరిపిన వ్యవసాయ ప్రదర్శ నాలసంఖ్య | 5.485 |
| 4. | అదనంగా నీటి పారుదల వసతి లభించిన భూమి | 1.234యకరాలు |
| 5. | సప్లయిచేసిన మేలుజాతి పశువులసంఖ్య | 68 |
| 6. | సప్లయిచేసిన మేలుజాతి పశుల సంఖ్య | 328 |
| 7. | గ్రామీణప్రాంతాల మరుగు దొడ్లు | 978 |
| 8. | మంచినీటి బావులు-నిర్మాణం | 189 |
| 9. | ,, ,, మరమ్మతులు | 575 |
| 10. | వయోజన విద్య | 2.009 |

## వ్యవసాయం

బ్లాకు ప్రాంతాల జనాభాలో 85 శాతం వ్యవ సాయంపై జీవించేవారు అయినందున యీ వృత్తికి

సమాజ వికాస కార్యక్రమంలో అధిక ప్రాధాన్యము యివ్వబడింది. వ్యవసాయ కృషిని తీవ్రంచేసి, అధికోత్పత్తికి అవకాశం కలుగజేయుటకై రసాయనిక ఎరువులు, మామూలు ఎరువులు, మేలురకం విత్తనాలు, నవీన ఉత్పత్తి విధానాల అనుసరణ, ప్రత్యక్ష ప్రదర్శనలు మొదలగు కార్యక్రమాలకు ప్రోత్సాహం యివ్వటం జరిగింది. మేలురకం విత్తనాలు రసాయనిక ఎరువులు, కంపోస్టు, పచ్చి ఎరువులు, క్రిమిసంహారక ద్రవ్యాలు వగైరా వాడటం వల్ల కలిగే ప్రయోజనాలను రైతులు చాలావరకు గుర్తించారు. అన్ని బ్లాకులలోనూ పచ్చి ఎరువుల వాడకం ఒక ఉద్యమస్థాయిలో ప్రచారం చేయబడింది.

ఈ అర్ధ సంవత్సర కాలంలో 16749 మ. ఉత్తమ విత్తనాలు, 34469 మ. రసాయన యెరువులు, 482 ఆధునిక పరికరాలు పంపిణీ చేయబడినవి. ఆపైన 5158 యకరాల్లో జపానుపద్ధతి వరిసాగు అమలు పరచబడింది. 5485 వ్యవసాయ ప్రదర్శనలు జరుపబడినవి. వ్యవసాయోత్పత్తిని అధికం చేయటానికి కంపోస్టు ఎరువు అతిప్రధానమైనది కనుక 7197 కంపోస్టు గుంటలు త్రవ్వబడినవి. మిరియాలగూడెం, దేవరకొండ, సూర్యాపేటలలో రైతులకు విత్తనాలు సప్లయిచేయుటకు 3 బీజ క్షేత్రాలు నెలకొల్పబడినవి. ఈ సంవత్సరంలోనే మిగిలిన బ్లాకులలో యింకా 6 క్షేత్రాలు నెలకొల్పబడగలవు.

జిల్లాలో సహకార సేద్యాన్ని ప్రోత్సహించుటకై, ప్రయోగాత్మకంగా రెండు సహకార వ్యవసాయ సంఘాలు ఏర్పాటుచేయబడినవి. చింతపల్లి బ్లాకులోని గద్యగోవరం, మిరియాలగూడెం బ్లాకులోని తిమ్మారెడ్డిగూడెం గ్రామాలలో యివి స్థాపించబడినవి. కొప్పోలు, పెరవేడుల, పోచంపల్లి (భూదానోద్యమం పుట్టిన గ్రామం) గ్రామాలలో యింకా మూడు సంఘాలు నిర్మించాలని ప్రయత్నాలు జరుగుతున్నవి.

అన్ని బ్లాకుల్లోను సకాలంలో రాబీ ఉద్యమం ప్రారంభమైంది. గ్రామ స్థాయి సేవకులు, శిక్షణ పొందిన గ్రామ సహాయకులు, కృషి పండితులతో కూడిన 35 ఉద్యమదళాలు 255 గ్రామాలలోవిస్తృత ప్రచారానికై ఏర్పాటు చేయబడినవి.

## పశుపోషణ

వ్యవసాయాభివృద్ధి కార్యక్రమంలో పశువులకు ప్రధానమైన స్థానముంది. ఎక్కువగా పాలు, మాంసము, గ్రుడ్లు సప్లయిచేయటానికి, పనికిరాని ఆబోతులను తొలగించటానికి, వ్యవసాయానికి సమర్థములైన యెద్దులను తయారుచేయటానికి ఉద్దేశించి యీ కార్యక్రమం జిల్లాలోని అన్ని బ్లాకులలోనూ ఉచ్చస్థాయిలో కొనసాగించబడింది.

స్థానిక పశుగణమును అభివృద్ధి చేయుటకై 68 మేలుజాతి పశువులు యీ ప్రాంతాలకు సప్లయి చేయబడినవి. గ్రామీణ పశువైద్యశాలలు స్థాపించి పశువైద్య సౌకర్యాలు పెంచబడినవి. మందుల పెట్టెలు, తాలూకా స్టేషనరీ ఆసుపత్రులద్వారా కూడా యీ సౌకర్యాలు కల్పించబడినవి. భువనగిరి, సూర్యాపేటలలో స్టేషనరీ ఆసుపత్రులు స్థాపించబడినవి. ఇవికాక సంచారక వైద్యశాలలు పనిచేస్తూనే వున్నాయి. యింతవరకు 19,387 పశువులకు టీకాలు వేయబడినవి. కోళ్ళ పెంపకం విషయంలో కూడా శ్రద్ధగైకొనబడింది. దేశీయజాతులను పూర్తిగా తీసివేసి మేలుజాతులను అభివృద్ధిపరచటానికి ప్రతి బ్లాకులో కనీసం రెండు గ్రామాలలో ఏర్పాటు చేయటానికి ప్రయత్నం జరుగుతున్నది.

## గ్రామ పారిశుద్ధ్యము

ఈ అర్ధ సంవత్సర కాలంలో ప్రజారోగ్య కార్యక్రమాల అభివృద్ధి జోరుగా సాగింది. 978 గ్రామీణ మరుగుదొడ్లు, 202 మంచినీటి బావులు, 515 బావుల మరమ్మతులు 533 పొగరాని పొయ్యిలు, నిర్మించబడినవి. 1959 మార్చి నెలాఖరుకు మంచినీటిబావులు లేని గ్రామాలన్నింటిలో బావుల నిర్మాణం జరగాలని ప్రతి బ్లాకులోను కార్యక్రమం తయారు చేయబడింది.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు గ్రామీణ ప్రజల ఆదరాన్ని బాగా పొందుతున్నవి. ప్రజలు వాటిని బాగా ఉపయోగించుకొని ప్రయోజనం పొందు

తున్నారు. ఈ కేంద్రాల స్థాపనకు ప్రజలుయిచ్చే విరాళాలు గూడా బాగా పెరిగినవి. నకేరికల్ బ్లాకులో రూ. 10,000ల విరాళం పూర్తిగా ప్రజలే వసూలుచేసి కేంద్రాన్ని నకేరికల్లులో స్థాపించుటకు నిర్ణయంచేశారు భువనగిరిపంచాయతీసమితిలో పంచాయత్ ప్రతినిధులు రూ. 6000 వసూలు చేశారు. ఇంకా వసూళ్లు జరుగుతున్నవి. సూర్యాపేటలో రూ. 2,000 వసూలైంది. బెఢోల్ గ్రామస్తులు మిగిలిన మొత్తమంతా యివ్వటానికి వాగ్దానం చేశారు. ప్రస్తుతం భువనగిరి బ్లాకులో రాయగిరి, పెద్దవూరు బ్లాకులో పెద్దదేవలపల్లి, చింతపల్లి, బ్లాకులోని మర్రిగూడలోనూ ప్రాథమిక కేంద్రాలు పనిచేస్తున్నవి. చౌటుప్పలబ్లాకులో ఒక సంచార వైద్యయూనిట్టు పని చేస్తున్నది. ఇక్కడి ఆరోగ్య కేంద్రానికి రెండెకరాల స్థలం విరాళంగా యిచ్చారు.

## సాంఘిక విద్య

వయోజన విద్యా కేంద్రాల స్థాపన, యువజన క్లబ్బులు, మహిళా సమితుల; స్థాపన విషయంలో కృషి చక్కగా జరుగుతున్నది. ప్రస్తుతం 102 వయోజన విద్యాకేంద్రాలు పనిచేస్తున్నవి. వీటిలో యీ అర్థ సంవత్సరకాలంలో 2009 మంది వయోజనులు అక్షరాస్యులైనారు. గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో ప్రజలను సమీకరించుటకు యువజన క్లబ్బులు, రిక్రియేషన్ కేంద్రాలు బాగా పనికి వచ్చినవి. పఠనాలయాలు, గ్రంథాలయాలు కాక అదనంగా 115 కమ్యూనిటీ కేంద్రాలు స్థాపించ బడినవి.

## సహకారము

భువనగిరి, సూర్యాపేట, బ్లాకులలోని అన్ని గ్రామాలు సహకారోద్యమ పరిధిలోనికి వచ్చినవి. మిగిలిన బ్లాకులలో 80-90 శాతం గ్రామాలలో సహకార సంఘాలు ఏర్పడినవి. ఈ అర్థ సంవత్సర కాలంలో 4205 మంది సహకార సంఘ సభ్యులుగా చేరారు. 67 గ్రామాలలో 49 సంఘాలు ఏర్పాటైనవి. సహకార సంఘాలద్వారా. రైతులకు విత్తనాలు, ఎరువులు పశువులు కొనుక్కోటానికి మొత్తం రూ. 5,11,912లు ఋణముగా యివ్వబడింది.

## గ్రామ సహాయకుల శిక్షణ

సమాజవికాసోద్యమం అన్ని రంగాలలో గ్రామ నాయకులను తర్ఫీతుచేయుటకై శిక్షణ శిబిరాలు నిర్వహించ బడినవి. దీనివల్ల గ్రామ ప్రాంతాల యువజనులకు ఉత్సాహం కలిగించి, ప్రణాళికా కార్యక్రమాలు అమలు పరచుటలో వారిని శిక్షితులుగా తయారుచేయుటకు అవకాశం జిక్కింది. ఈ కాలంలో 33 శిబిరాలలో 1,714 మంది గ్రామ సహాయకులకు శిక్షణ యివ్వబడింది. వీరు శిక్షణ పొందితమతమ గ్రామాలకు వెళ్లి స్థానిక రైతులకు వ్యవసాయ పద్ధతుల నవీన విశేషాలను వివరించి చెప్పి తోడ్పడుతున్నారు. ఈ శిక్షణ శిబిరములు ప్రజల ఆదరణ పొందుతున్నవి. బియ్యం, వంట చెరుకు వగైరావస్తువులు విరాళంగా యిచ్చి యీ శిబిర నిర్వహణలో ప్రజలు బాగా సహకరిస్తున్నారు. ప్రభుత్వ ఖర్చు రూ. 1,943లు కాగా శిబిరాల నిర్వహణకు ప్రజల విరాళం రూ, 2,458 లు.

ప్రణాళికా ప్రచారం కొరకు జిల్లా స్థాయిలో నెలసరి వార్తా సంచిక ప్రారంభించాలని, జిల్లా సమాచార కార్యాలయం ఏర్పాటు చేయాలని సంకల్పం. పెద్దవూర బ్లాకులోని పెరువేదుల గ్రామంలో కుటుంబానికొక ప్రణాళిక—అనే పథకం అమలు పరచబడు తున్నది.

ఈ అర్థ సంవత్సర కాలంలో భువనగిరి బ్లాకు, పంచాయతీ సమితి బ్లాకుగా ఎన్నికైంది. దీనికి సహకార శాఖామాత్యులు 1958 జూలై 1వ. తేదీన ప్రారంభోత్సవం చేశారు. పంచాయతీ సమితి ఏర్పాటైనప్పటి నుండి ప్రజల దృక్పథంలో చాలా మార్పు వచ్చింది. ప్రజలందరు యిప్పుడు తమ ప్రతినిధులద్వారా అభివృద్ధి కార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొంటున్నారు. పంచాయతీ సమితి ప్రారంభానికి పూర్వం ప్రారంభమైన పనులు యిప్పుడు త్వరత్వరగా పూర్తి చేస్తున్నారు.

వివిధ అభివృద్ధి కార్యక్రమాల్లో ప్రజలు ఉత్సాహంగా సహకరిస్తున్నారు. ఈ కాలంలో ప్రజల నుండి వచ్చిన విరాళం రూ. 1,28,004 లు. ప్రభుత్వ ఖర్చు రూ. 3,40,270 లు. బ్లాకు ప్రాంతమంతటా పంచాయతీలు ఏర్పాటు చేయటానికి చురుకుగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. జిల్లాలోని బ్లాకు డెవలప్ అధికార్లలో ఒక కొత్తరకం పోటీ పద్ధతి ఏర్పాటు చేయబడింది. బాగా పనిచేసిన బ్లాకుకు షీల్డు బహూకరించ బడుతుంది. ప్రతి నెల కలెక్టరు, యితర జిల్లా అధికార్లు సందర్శిస్తూ వుండటం వల్ల సమస్యల పరిష్కారంలో చాలా సహాయం లభిస్తున్నది.





రాష్ట్ర గవర్నరు 2-10-1958 న టి బి సీళ్ల అమ్మకం వుద్యమాన్ని ప్రారంభిస్తున్నారు

# క్షయ నివారణ కార్యక్రమం

"క్షయతో ప్రతివ్యక్తి పోరపోరాటాన్ని జరపాలి" అని గడచిన గాంధీజయంతినాడు ఆంధ్రప్రదేశ్ క్షయసంఘం అధ్వర్యాన 8వ క్షయసీళ్ల అమ్మకాన్ని ప్రారంభిస్తూ రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ అన్నారు రాష్ట్ర యెగువసభ అధ్యక్షులు శ్రీ మాడపాటి హనుమంతరావు అధ్యక్షత వహించారు

దురదృష్ట వశాత్తూ క్షయరోగ పీడితులైనవేలాది సోదర దేశీయులకి నిరంతరాయంగా సేవచేయుటకు పూనుకోనడంకంటె గాంధీజీ స్మృతికి మంచి ఉత్తమ విధానం లేదన్నారు ఈ దేశంలో 25 లక్షలమంది ప్రజలు యీవ్యాధికి గురైనారు ఒక్కొక్క క్షయరోగివల్ల అధమం అయిదుగురికి యీవ్యాధి వ్యాపిస్తున్నదని అంచనా వేయబడింది ఈజబ్బుతో యేటా 6 లక్షలమంది చనిపోతున్నారు అంటే దేశంలో నిమిషాని కొకరు మరణిస్తున్నా రన్నమాట ఈ వ్యాధివల్ల దేశానికి భౌతికంగా వాటిల్లే నష్టాన్ని అంచనా వెయ్యలేము క్షయ నెదుర్కొనుటకు ముఖ్యంగా మానవ దృక్పథం కావాలి

క్షయ నివారణకై ప్రజోద్యమం సాగాలనీ, యీవిషయంలో ఒక్క ప్రభుత్వమేమీ చేయలేదని గవర్నరు అన్నారు క్షయ సంఘానికి ప్రజాసహకారం, సహాయం లభించాలన్నారు వచ్చేనెలల్లో దేశంలో ప్రతిఒక్కరు ఒక్క క్షయసీలుని వుపయోగించినట్లయితే, యీవ్యాధిని నివారించాలన్న సందేశం దేశంలోని ప్రతిమనిషికి అందుతుంది

## సులభ పద్ధతి

క్షయనివారణ కార్యక్రమంలో బి సి జి టీకాల పద్ధతికి అధిక ప్రాధాన్యత యివ్వబడినదనీ, యీనాడు

ఆధునిక శాస్త్రం క్షయనిరోధానికి చెప్పే సులభతమమైన మిక్కిలి చవుక పద్ధతి అదేననీ ప్రజారోగ్య శాఖ డైరెక్టరు శ్రీ సి. ఆర్. నాయుడు మాట్లాడుతూ అన్నారు. భారతదేశంలో బి.సి.జి వుద్యమం ప్రపంచం యితరదేశాలలో తలపెట్టిన భారీయెత్తు నివారణోద్యమాలలో ఒకటన్నారు. ఆంధ్రప్రదేశ్ లో ప్రస్తుతం 12 బి.సి.జి జట్టులు పనిచేస్తున్నవి. బి.సి.జి జట్టులు తెలంగాణా ప్రాంతమంతలోను పనిచేశాయి. ఇప్పుడు కృష్ణా, నెల్లూరు, గుంటూరు, కర్నూలు జిల్లాల్లో పనిచేస్తున్నాయి. ఇంతవరకూ 1,27,51,740 మంది వ్యక్తులు పరీక్షించబడ్డారు. 46,75,774 మందికి టీకాలు వేయబడినవి. హైదరాబాదులో యించుమించు 6000 మందికి యిళ్లవద్ద చికిత్స చేయబడుతున్నది. ఈ పథకం సమర్థంగా నడచుటకై ఆయూనిట్లు పనిచేస్తున్నాయి. హైదరాబాదు నగరానికి 11 జట్లు, సికిందరాబాదుకి 2 జట్లు కావాలి.

ఆయన ప్రసంగం భాగాలు దిగువ యివ్వబడినవి:-

“క్షయ ‘ట్యూబర్ కిల్ బాసిలస్’ అనే క్రిమివల్ల వస్తుందని మీలో చాలమందికి తెలుసు. 1882 లో రాబర్ట్ కోచ్ దానిని కనుగొన్ననాటినుంచి యీ వ్యాధి నిర్మూలనకై కృషిచేయబడుతున్నది. ఇది అంటువ్యాధి. ఒకరినుంచి మరొకరికి అనేకవిధాల వ్యాపిస్తుంది, క్షయ క్రిములుగల గాలిని పీల్చుటతో అది వ్యాపిస్తుంది. క్షయరోగులు వాడిన మంచినీటి గ్లాసులు, అన్నంతినే కంచాలు వగైరా, పక్కబట్టలు, తువ్వాళ్లు వగైరాలద్వారా యితరులకి సోకుతుంది. క్షయ క్రిములుగల దుమ్ముద్వారా కూడా అది వ్యాపిస్తుంది.

క్షయనివారణకై ముఖ్యంగా మూడు చర్యలు గైకొనబడాలి.

1. మొత్తంమీద ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించుట.
2. అంటురోగులను ఆస్పత్రులలో విడిగావుంచి చికిత్సచేయుట,
3. నిరోధం.

దేశంలో మొత్తం 35 కోట్ల మంది ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధిపరుచుట బృహత్కార్యం. ఈ విషయంలో యిదివరకే ప్రభుత్వము, ప్లానింగు కమిషను పంచవర్ష ప్రణాళికలద్వారా కృషి చేస్తున్నవి. చెప్పుకోదగిన ఫలితాల సాధనకు చాలాయేళ్లు పడుతుంది.

భారతదేశానికి అధమం 4000 క్షయక్లినిక్కులు, 5 లక్షల మంచాలు, 15 వేల మంది డాక్టర్లు, 50 వేల మంది సుశిక్షితులైన నర్సులు, 12 వేల మంది హోం విజిటర్లు అవసరమని ప్లానింగు కమిషన్ ఆరోగ్య సంఘం అంచనావేసింది. ఇందుకు ఒక్కసారిఅయే ఖర్చుక్రింద రూ. 450 కోట్లు, యేటా ఖర్చుకి రూ. 60 కోట్లు కావాలి. దేశానికి దీనిని భరించే స్తోమతలేదు. తగిన సిబ్బంది, ధనములేని ప్రస్తుత పరిస్థితులలో యీ లోపాలను సరిదిద్దుటకు సమీప భవిష్యత్తులో అవకాశంలేదని ప్లానింగు కమిషన్ గుర్తించింది. కావుననే అది ఒక్కొక్క పథకం ముందు ప్రాధాన్యతను సూచిస్తూ ఒక ప్రణాళికను తయారుచేసింది. ఈ పథకాలు అందుబాటులోనున్న సిబ్బంది, ధనాలతో వుత్తమ ఫలితాలను యిచ్చే అవకాశంగల నిరోధకచర్యలయి వున్నాయి. ఈ పథకాలముందు ప్రాధాన్యత క్రమంయిది:

1. నిరోధచర్యలు, బి. సి. జి. టీకాల వుద్యమం.
2. జిల్లా ఆస్పత్రులన్నిటిలోను క్షయక్లినిక్కులు, జిల్లాకొకటి చొప్పున ప్రదర్శన కేంద్రాల స్థాపన.
3. సంస్థాబద్ధమైన మంచాలు, పునరావాస కేంద్రాల స్థాపన.
4. కుటుంబాలకి ఆర్థిక సహాయం.
5. ఆరోగ్య ప్రచారం.
6. క్షయవ్యాధుల గురించి బోధన, పరిశోధన.

## బి. సి. జి. టీకాలు

క్షయనిరోధ కార్యక్రమంలో బి. సి. జి. టీకాలకి అధికప్రాధాన్యత యివ్వబడుతున్నది. ఈనాడు ఆధునిక శాస్త్రంచెప్పే వుత్తమ పద్ధతియిదే. ఇది

సులభమైనది. మిక్కిలి చవుక. చక్కగా పనిచేస్తుంది. దేశంలో యీ వ్యాధికి గురికాగల ప్రమాదంగల వారందరికీ ముందు జాగ్రత్తగా 5-8 సంవత్సరాలలో యీ టీకాలను వేయాలనేది ఆశయం. అట్టివారు దేశంలో రమారమి 1700 లక్షలు, యెక్కువగా 20 సంవత్సరాలలోపు వారిలో వున్నారు. బి. సి. జి. టీకాల కార్యక్రమాన్ని కేంద్ర ప్రభుత్వం 1948 లో చిన్న యెత్తున ప్రారంభించింది. 1951 లో అది జాతీయ వుద్యమంగా, మార్చబడింది. ఇప్పుడు 154 బి. సి. జి. జట్లు పనిచేస్తున్నాయి. 30-9-57 నాటికి రమారమి 96,400,000 మంది పరీక్షించబడ్డారు. రమారమి 33,800,000 మందికి టీకాలు వేయ బడినవి.

ఈ బి.సి.జి. వుద్యమం అన్ని రాష్ట్రాలలోను నడుస్తున్నది. ఇది ప్రపంచంలో యెదేశంలోనైనా తలపెట్టిన మిక్కిలి పెద్ద నివారణోద్యమాలలో ఒకటి.

జాతి విస్తృతమైన యీ ప్రధాన వుద్యమంపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు యిప్పటికి రూ. 134.6 లక్షలను ఖర్చుపెట్టాయి. ఇవిగాక యునిసెఫ్‌నుంచి పరికరాలు, శకటాలు వగైరారూపంలో 1,487,000 డాలర్లు లభించినవి. ఆపైన ప్రపంచ ఆరోగ్య సంస్థ సాంకేతిక నిపుణుల సహాయాన్ని అందజేసింది.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 12 బి.సి.జి. జట్లు పని చేస్తున్నాయి. తెలంగాణాలో వాటి పని పూర్తి అయింది. నిజామాబాదు, మెదక్ జిల్లాల్లో రెండవ సారి కూడా పని జరుబడింది, ఆంధ్ర ప్రాంతంలో 7 జిల్లాల్లో పని పూర్తయింది. కృష్ణా, నెల్లూరు, గుంటూరు, కర్నూలు జిల్లాల్లో పని జరుగుతున్నది.

## చికిత్స, శిక్షణా సౌకర్యాలు

ఆంధ్రప్రదేశ్‌లో 3 ఆరోగ్య సదనాలు, 3 క్షయ ఆస్పత్రులు వున్నాయి. వాటి మొత్తం మంచాల సంఖ్య 1775. గుంటూరు జిల్లా మంగళగిరిలో క్షయ ఆస్పత్రి భవనం నిర్మాణం యిప్పుడే పూర్తిఅయింది. ఆ సంస్థ యీ నెలలో ప్రారంభింప బడగలదని భావించబడు తున్నది. దబిర్పూరాక్షయ క్లినిక్‌లో ప్రదర్శన, శిక్షణాకేంద్రం తెరువ బడింది. రొమ్ము జబ్బులు, క్షయ సంస్థకి గౌ॥ ముఖ్యమంత్రి యిటీవలనే శంకుస్థాపన చేశారు.

## గృహచికిత్స

హైదరాబాదులో యించుమించు 6000 మంది రోగులకి యింటివద్ద చికిత్స చేయబడు తున్నది. జంట నగరాలలో 6 యూనిట్లు పని చేస్తున్నాయి. ఈ పథకానికై క్షయ సంస్థ 4 ఆటో-రిక్షాలను యిచ్చింది. ఈ గృహచికిత్సా జట్టులు బాగుగనే పని చేస్తున్నాయి. కాని పని యింకా సమర్థంగా జరగాలంటే లక్షమందికి అధమం ఒకజట్టు అయినా వుండాలి. ఈ లెఖ్ఖని హైదరాబాదునగరం ప్రస్తుత జనాభా 11 లక్షల మందికి ప్రస్తుతంలా 5 కాక 11 జట్టులు, సికిందరాబాదులో ఒకటి కాక 2 జట్టులు వుండాలి.

## కుటుంబ సహాయం

క్షయ నివారణ సమగ్ర వుద్యమంలో క్షయ రోగుల కుటుంబాలకు సహాయ పడుట కూడా ఒక ప్రధానాంశం. కాబట్టి ఆంధ్రప్రదేశ్‌లో యీవ్యాధి నివారణ కార్యక్రమంలో పై అంశం క్రింద కూడా పని ప్రారంభించ బడుతుండటం ముదావహం.

క్షయ రోగుల పునరావాసం, అనంతర-రక్షణ విషయంలో కూడా ప్రత్యేక శ్రద్ధ గైకొన బడాలి. ఈ సందర్భంలో యిటీవలే హైదరాబాదు, సికిందరాబాదు నగరాల పౌరులు సమావేశమై యీ రెండు నగరాలలోను అనంతర-రక్షణ సంఘాలను యేర్పాటు చేయాలనీ, నిర్ణీతమైన కొన్ని ప్రాంతాల గ్రూపులకి శాఖలను నెలకొల్పాలనీ కోరడం జరిగింది. క్షయ నివారణ కార్యక్రమంలో దీనికి కూడా ప్రాధాన్యత యివ్వడం అవసరం.

## మెడికో-సోషల్ వర్కర్లు

గృహచికిత్స, అనంతర - రక్షణ సంఘాలపని ఫలించాలంటే చెస్టుఫిజీషియను, హెల్తు విజిటరు, మెడికో-సోషల్ వర్కరు చికిత్స ప్రతి దశలోను పరస్పరం సంప్రదించి, సహకరించు కోవాలి. అవసర మయితే యింటికి అంతా వెళ్లి చూడవచ్చు. అందరూ

కూడా స్థానిక రక్షణ సంఘం లేక తత్తుల్యమైన సంస్థలో సభ్యులై వుండాలి.

## కుటుంబ రక్షణ

రక్షణసంఘం పని సందర్భంలో 'కుటుంబరక్షణ'ను కూడా యేర్పాటుచేసి, కుటుంబ సహాయం, ప్రత్యేక సందర్భాలలో బట్టలు, ఆరోగ్య సదనానికి వచ్చి రోగిని చూచుటకు అతడి బంధువులకు రాకపోకల ఖర్చులు మున్నగు, వాటిని యివ్వాలి. ఈ పని భారతీయ సంఘసేవా మహాసభ, ఆస్పత్రి సంక్షేమ సంఘాలు, రెడ్ క్రాస్ అండ్ అంబ్యులెన్సువంటి స్వచ్ఛంద సేవా సంస్థల డబ్బు లేక తోడ్పాటుతో జరగాలి.

## క్షయ సీళ్ల అమ్మకం

క్షయ నివారణకై ఒక్క ప్రభుత్వమేమీ చేయలేదు. కాబట్టి 1939లో భారతీయ క్షయ సంఘం యేర్పడింది అప్పటినుంచి అది యీ వ్యాధి నివారణోద్యమంలో ప్రశంసనీయంగా పనిచేస్తూ, సాధ్యమైన అన్ని విధాలా ప్రభుత్వంతో సహకరించి తోడ్పడు తున్నది

భారతీయ క్షయసంస్థ 1950 నుంచి క్షయసీళ్ల వుద్యమం నడుపుతున్నది. ఈ వుద్యమం యేటా గాంధీజయంతినాడు ఆరంభమై రిపబ్లిక్ డే తో ఆఖరవుతుంది. ఈ అమ్మకంవల్ల వచ్చిన డబ్బు దిగువ ప్రయోజనాలకి వుపయోగించబడుతుంది క్షయ ఆస్పత్రులు, వార్డులు, క్లినిక్కులు, పునరావాస కేంద్రాల నిర్మాణం, గృహచికిత్సా సౌకర్యాల యేర్పాటు, పేదరోగులకి సహాయం; డాక్టర్లకి క్షయలో రిఫ్రెషర్ కోర్సులను నడుపుట, సంస్థలకి పరికరాల కొనుగోలు

క్షయరోగ కార్యకర్తలు వుత్సాహవంతులైన స్త్రీపురుషులు వారి జీవితాలు త్యాగబుద్ధితో గొప్ప కార్యానికై అంకితమైనవి వారు క్షయనివారణకై యెంతో కృషిచేస్తున్నారు ఈ వుద్యమాన్ని బలపరుచుట మన విధి. ధారాళంగా సొమ్మియిచ్చి అందరూ దీనికి తోడ్పడవచ్చు. ఈ సీళ్ళ వుద్యమం వాస్తవానికి గాంధేయమార్గంలో సోదర మానవ సౌహార్ద్రాన్ని పెంపొందించి, దురదృష్టవశాత్తూ వ్యాధిగ్రస్తులయిన సోదర మానవులకు సహాయంచేసే అదృష్టాన్ని మిగిలినవారికి కల్పిస్తుంది.



ప్రజారోగ్యశాఖ డైరెక్టరు ప్రసంగిస్తున్న దృశ్యం.

మనదేశంలో యీ వుద్యమం యితర దేశాలలో యిట్టి వుద్యమాలు సాధించిన పురోభివృద్ధిని సాధించ లేదు. వసూలయే సొమ్ము యేటేటా హెచ్చవలసింది. ఇటీవల అనేక విషయాలకై ప్రజల సహాయం కోర బడుతున్నది. క్షయనివారణ వుద్యమం వాటిలో ఒకటి మాత్రమే. అయినా దీనికి ప్రజాదరం లభించ వలసినంత లభించలేదు. ఈ వుద్యమం విజయం యెక్కువగా దయాళువులైన ప్రజలు, అనధికార సంస్థలపై ఆధారపడి వుంటుంది.

మీరంతా యీ వుద్యమానికి తోడ్పడి క్షయ రోగుల రక్షణకై ధారాళంగా డబ్బుయిమ్మని కోరుతున్నాను. ఈ వుద్యమం వుదాత్తమైనదేకాక కరుణాపూరితమైనదికూడా.



# మహబూబునగరం

ప్రస్తుతపు మహబూబునగరం పట్నం అసలు పేరు పాలమూరు. 17 వ శతాబ్దంలో అది "లోక్కైపల్లి" సంస్థానంలో ఒకగ్రామం. సంస్థానాధికారులు ఆ పట్టణాన్ని అభివృద్ధిపరచారు మహబూబుఅలీ బాద్‌షా (6 వ నైజాం) రాజ్య పరిపాలనా కాలంలో దానికి మహబూబునగరం అని పేరు పెట్టబడింది. మొదట యీ పట్నం నాగరకర్నూలు జిల్లాక్రింద వుండేది. క్రీ. శ 1904 లో జిల్లా ముఖ్యపట్నం మహబూబు నగరానికి మార్చబడింది ఆ విధంగా మహబూబు నగరం పట్నం జిల్లా ముఖ్యపట్నమయింది 7 వ నైజాం రజతోత్సవాల సందర్భంలో కలక్టరు కార్యాలయం, పరిశ్రమత్వ వున్నత పాఠశాలలవంటి కొన్ని చక్కని భవనాలు నిర్మించబడ్డాయి.



రాజా జె. రామేశ్వరరావు, పా ర

జాగీర్ల లీనీకరణకి ముందు అనగా 1950 కి పూర్వం యీజిల్లాలో 6 తాలుకాలు వుండేవి అవి యివి మహబూబునగరం, కల్వకుర్తి, పర్గి, నాగర్ కర్నూలు, మఖ్తాల్, అచ్చంపేట. జాగీర్ల లీనీకరణ ఫలితంగా దీనికి మరినాలుగు జిల్లాలు కలుపబడినవి. అవి యివి షాద్‌నగర్, కొల్లాపూర్, వనపర్తి, ఆత్మకూరు ఆవిధంగా మహబూబునగరం జిల్లాలో 10 తాలూకాలు వుండేవి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కారణంగా యిటీవల యీరాష్ట్రం మూడుగా విభజించ బడినప్పుడు దానిలో మరమూడు తాలూకాలు కలుపబడ్డాయి. అవి యివి రాయచూరు జిల్లానుంచి గద్వాల్, అలంపురం తాలూకాలు, గుల్బర్గా జిల్లానుంచి కొడంగల్ తాలూకా. అయితే పరిగి తాలూకా హైదరాబాదు జిల్లాలో కలుప బడింది. ఈవిధంగా యిప్పుడు యీ జిల్లాలో 12 తాలూకాలు వున్నాయి.



డా. కె. నాగన్న, శా.స., అలంపురం

## నైసర్గిక స్వరూపం

ఈజిల్లా కర్నూలు, గుంటూరు జిల్లాలనుంచి కృష్ణానదిచే వేరుబరచ బడుతున్నది. నల్గొండ,

## పరిశ్రమలు

ఈ జిల్లాలో భారీ పరిశ్రమలేమీలేవు. చిన్నతరహా పరిశ్రమలలో 16 బియ్యంమిల్లులు, 12 వనస్పతి, 15 పొగాకు ఫ్యాక్టరీలు, 4 వేరుశనగ తొక్కవొలిచే ఫ్యాక్టరీలు, 1 ప్రత్తిగిన్నింగ్, ప్రెస్సింగు ఫ్యాక్టరీ లను పేర్కొనవచ్చు

## కుటీర పరిశ్రమలు

జిల్లా అన్నిప్రాంతాలలోను వివిధరకాల ముతక నూలుబట్ట నేయబడుతుంది నారాయణపేటలో జలతారు అంచులచీరలు, పంచలు నేయబడి పూనా, షోలాపురం, బొంబాయి, బరోడాలకు యెగుమతి చేయబడతాయి గద్వాలచీరలుకూడా అంతప్రసిద్ధి కలవే. మక్తాల్, దేవరకద్ర, నాగరకర్నూలు, అమరాబాదులలో మామూలు వున్నికంబళ్లు నేయ బడతాయి. యెంగొండ చాపల పరిశ్రమ, గాజుల పరిశ్రమలను కూడా కుటీర పరిశ్రమలలో పేర్కొనవచ్చు.

పటా ఫిబ్రవరినెలలో జరిగే మెన్నెంకొండ జాత్రకి యీ జిల్లా అన్ని ప్రాంతాలనుంచి జనం వస్తారు. శ్రీరంగపురం జాత్ర మార్చినెలలో వస్తుంది. ఇదికూడా చూడదగినది. శివరాత్రికి భారతదేశం నలుమూలలనుంచి యాత్రికులు మన్ననూరు-ఫరహా బాదు రోడ్డుమీదుగా శ్రీశైలం వెడతారు. అలం పురం క్షేత్రం అద్భుతమైన కళాకేంద్రం. దీనికి



శ్రీ పులి రామస్వామి. పా స.

కర్నూలు, రాయచూరు, గుల్బర్గా జిల్లాలు దీని సరిహద్దులుగా వున్నాయి. ఈజిల్లా ముఖ్యనది కృష్ణానది. అది యీజిల్లాకి దక్షిణ, ఆగ్నేయ సరిహద్దుగా వున్నది. దిండి, పెద్దవాగులు దాని ప్రధానమైన ఉపనదులు అయివున్నవి. విస్తీరం 6,98,111 చ. మైళ్ళు. ఈజిల్లాలో 4 రెవిన్యూ డివిజన్లు వున్నాయి.



శ్రీ బస్సప్ప గాంధీ, శా.స.స., నారాయణపేట.



శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ, శా.స.స., ఆలంపురం.



శ్రీ మురళీధర రెడ్డి, శా. స. స, ఆత్మకూరు.

చాళుక్యవంశపు రాజచరిత్రతో సంబంధంవుంది. దానికి దక్షిణకాశీఅని ప్రసిద్ధి. అలంపురంలోని బాల బ్రహ్మేశ్వరస్వామి ఆలయం, నరసింహస్వామి ఆలయం మిక్కిలి ప్రసిద్ధమైనవి. అక్కడ యాత్రా కేంద్రాన్ని నెలకొల్పాలని సంకల్పించబడింది. అక్కడగల ప్రాచీనకాలానికి చెందిన సుందరమైన నల్లరాతి చెక్కడాలు దాని ప్రాశస్త్యాన్ని యినుమడింపచేస్తున్నవి. అవి పురాతత్వశాఖచే పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపరుపబడినవి. ఈ జిల్లాలోని వనపర్తి శ్రీరంగపురం జాత్రకికూడా ఒక ప్రత్యేకత వున్నది. చెప్పదగిన యితర విశేషాలలో పానగల్‌లోని పాతకొండ కోట. దానికి 7 పల్లిసద్‌లు వున్నాయి. ఆ కోటలో యెప్పుడూ వూరే ఒక వూట వుంది. దానినీరు స్వచ్ఛంగా మెరుస్తూవుంటుంది. మన్ననూరు కొండప్రదేశం. దానిచుట్టూ సుందరమైన ప్రకృతి దృశ్యాలు వున్నాయి.

## శీతోష్ణస్థితి

శీతోష్ణస్థితి యీ జిల్లా వివిధ ప్రాంతాలలో వేర్వేరుగా వుంటుంది. నాగరకర్నూలు, అమరాబాదు తాలూకాలలో శీతలంగా వుంటుంది. నారాయణపేట, మఖ్తాల్, జెడ్‌చెర్ల తాలూకాలలో యెండలు యెక్కువ. ఈ జిల్లాలో వర్షాలు జూన్, సెప్టెంబరు నెలలమధ్య కురుస్తాయి. దాన్ని సగటు వర్షపాతం 39.42 అం.

## భౌగోళికస్థితి

బసవై పల్లి, మామునపురాలలోను, మఖ్తాల్ తాలూకా కోటకుండ సమీపంలోను మహబూబునగరం తాలూకా మానికొండ, గాజులపేటలలోను గాజుపరిశ్రమకి పనికివచ్చే క్వార్ట్జు తగినంత వున్నదట. కొల్లాపురం తాలూకా పెంట్లవల్లిలోను, అమర్‌గిరి, బొల్లారం, ఇప్పలపల్లిలలోను వజ్రాలు దొరుకుతాయని కూడా చెప్పవచ్చు.

## వ్యవసాయం

జొన్న, బజ్ర ప్రధానాహార పంటలు; వరి, సావన్ మున్నగునవి ఆ తరువాత వస్తాయి. పంటలలో వరి, గోధుమ, జొన్న, సజ్జ, బార్లీ, మొక్క



శ్రీ డి. కె. సత్యారెడ్డి, శా. స. స., గద్వాల.



MAHABUB NAGAR DISTRICT
REFERENCE
STATE BOUNDARY
DIST, BOUNDARY
TALUK BOUNDARY
NATIONAL HIGHWAYS
STATE HIGH WAYS
RIVERS
ROAD
RAILWAWAY M.G
YADGIR
DAULATABAD
KOSGI
KODANGAL
SHADNAGAR
SHAD-NAGAR
FARUKH NAGAR
KISUM PET
BALANAGAR
YELJAL
KALWAKURTI
CHARAKONDA
MAHABUBNAGAR
KOILSAGAR
KOILKONDA
NARAVANPET
MAKTHAL
DEVRKADRA
JADCHARLA
TIMAJIPET
KALWAKURTI
GINDI PROJECT
WANPARTI
BIJNAPALLI
SARLASAGAR
ATMAKUR
TELKAPALLI
NAGAR KURNOL
CHENDRASAGAR
AMRABAD
ATMAKUR CHINTA
WANPARTI
PANGAL
KODER
KOLLAPUR
LINGAL
ACHAMPET
KRISHNA RIVER
GADWAL R.S.
GADWAL
GHUT
KOLLAPUR
ALAMPUR
TUNGABHADRA RIVER

జొన్న, చోడి, వరగు ప్రసిద్ధమైనవి. పప్పుదినుసులలో, శనగలు, పెసలు, కందులు, మినుములు, వులవలు మున్నగునవి ప్రసిద్ధమైనవి. మసాలాదినుసులలో మిర్చి, పసుపులను పేర్కొనవచ్చు. బాలనగరం, షాద్‌నగరాలు సీతాఫలాలకి ప్రసిద్ధి. అలంపురం, కొల్లాపురాలు మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో మామిడి పళ్లకి ప్రసిద్ధిచెందాయి.

వ్యవసాయానికి నీటి పారుదల ప్రధాన వనరుగా గల మిక్కిలి ముఖ్యమైన జిల్లాల్లో మహబూబు నగరం జిల్లా ఒకటి. ఇది ముఖ్యంగా వ్యవసాయ ప్రదేశం. ఇక్కడ అన్నిరకాల నీటిపారుదల పద్ధతులు అమలులోవున్నాయి: 1. చిన్నరకం నీటిపారుదల ప్రాజెక్టులు, 2. పెద్ద, చిన్న రకం చెరువులు. 3. బావులు. 4. త్రవ్విన కాలువలు 5. వూట కాలువలు, కొంత లిఫ్టు ఇరిగేషన్. మహబూబునగరం జిల్లాలో క్రింది 5 మధ్యరకం ప్రాజెక్టులు వున్నాయి.

1. దిండి.
2. కోయిల్‌సాగర్.
3. చంద్రసాగర్.
4. మూసపేట ప్రాజెక్టు.
5. సర్లాసాగర్ ప్రాజెక్టు.

పై 5 ప్రాజెక్టులలోను 4 ప్రాజెక్టులు అనగా దిండి, కోయిల్‌సాగర్, చంద్రసాగర్, మూసపేట ప్రాజెక్టులు యిదివరకే పూర్తిచేయబడ్డాయి. సర్లా. సాగర్ ప్రాజెక్టు పని కొనసాగుతున్నది. పైవాటిలో ఒక్కొక్కదాని వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి.

## దిండి ప్రాజెక్టు

దిండి ప్రాజెక్టుకి ఆపేరు దిండినదివల్ల వచ్చింది. అది నల్గొండజిల్లా దేవరకొండ తాలూకా గుండిల పల్లి గ్రామంలోవుంది. అది 1939 లో ప్రారంభించబడి, 1943 లో పూర్తిచేయబడింది. ఈ ప్రాజెక్టుకి మిక్కిలి దగ్గరగావున్న రైలుస్టేషను మధ్యరైల్వేలో హైదరాబాదు-ద్రోణాచలం సెక్షన్‌లోవున్న జెడ్చెర్ల స్టేషను. ఇది ప్రాజెక్టునుంచి 46 మైళ్ళ దూరంలో వుంది.

## కోయిల్‌సాగర్ ప్రాజెక్టు

ఇది మొదట తీసుకొనబడి తొలి పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన మధ్యరకం ప్రాజెక్టులలో ఒకటి. ఈ ప్రాజెక్టు స్థలం ఆత్మకూరు తాలూకాలో దేవరకొండ రైలుస్టేషనుకి 7 మై. దూరంలోవుంది. 7 మై. నిడివిగల సర్వీసురోడ్డు ఒకటి జలాశయం స్థలాన్ని హైదరాబాదు-బెంగుళూరు జాతీయ రహదారితో దేవరకొండ గ్రామంవద్ద కలుపుతుంది. జలాశయం స్థలం మహబూబునగరం తాలూకాలోని చరిత్రాత్మకము, ప్రాచీనము అయిన కోయల్‌కొండ పట్నానికి 4 మైళ్ళ దూరంలో మాత్రమే వుంది. కాబట్టి దానికి కోయిల్‌సాగర్ అని పేరువచ్చింది. ఇంతవరకూ 12,000 యెకరాలు అభివృద్ధి పరచబడి నీటి పారుదల క్రిందకు తేబడినవి.

## చంద్రసాగర్ ప్రాజెక్టు

ఇది పి. డబ్ల్యు. డి. నీటిపారుదల బ్రాంచిచే చేపట్టబడి పూర్తిచేయబడిన చిన్నతరహా ప్రాజెక్టులలో ఒకటి. ప్రాజెక్టు స్థలం అచ్చంపేట తాలూకాలో వున్నది. ఈప్రాజెక్టు దిండి ప్రాజెక్టుకి 9 మైళ్ల దూరంలో వుంది. 2 మైళ్ల నిడివిగల సర్వీసురోడ్డు ఒకటి దీనిని దిండి-అచ్చంపేట రోడ్డుతో కలుపుతుంది. దీనిక్రింద 4,100 యెకరాలువున్నాయి.

## సర్లాసాగర్ ప్రాజెక్టు

సంస్థానాల రద్దుకిపూర్వం దీనిని వనపర్తి సంస్థాన అధిపతి రాజారాజేశ్వరరావు 1947లో ప్రారంభించారు. దానికి ఆయన మాతృదేవి రాణి సరళా దేవి పేరు పెట్టబడింది. సంస్థానం దివానీలో విలీనం చేయబడినప్పుడు యీ పనిని 1950 లో పి. డబ్ల్యు. డి. చేపట్టింది. ఇది తొలిపంచవర్ష ప్రణాళికలో ఒకభాగమయింది.

ఈ ప్రాజెక్టుస్థలం వనపర్తి తాలూకాలో మధ్య రైల్వే హైదరాబాదు - ద్రోణాచలం మార్గంలోని వనపర్తిరోడ్డు రైల్వేస్టేషనుకి 4 మై. దూరంలో వుంది. ఈ ప్రాజెక్టులో కృష్ణానది వుపనదిఅయిన చినవాగుపై స్టోరేజి రిజర్వాయరు నిర్మించబడుతుంది.

ఈ జలాశయంనుంచి వాగుకిరుపక్కలా రెండు కాలువలు త్రవ్వబడతాయి. ఎడమకాలువ పొడుగు 10 మై. ఇది శంకరంపేట, దంతారం, మదనపురం, తిర్మలపల్లి, రామన్‌పహాడ్, వద్దవేలి, అజ్జకోవె, చోర్లపల్లి గ్రామాలలో ఆబీపంటకి 3,700 యె. కి, తాబీపంటకి 500 యె. కి నీటిని అందించుటకు వుద్దేశించబడింది. కుడికాలవ పొడుగు 1 మైలు. ఇది 300 దోఫసల వరిపంటకి నీరు అందించుటకు వుద్దేశించబడింది. ఆతరువాత యీ ఆనకట్టవల్ల నర్సింగపురం, నేలుయిడియ గ్రామాల పొలాలకి నీటిని అందించే కాలువ సరిగా పారదు. కాబట్టి కేవలం దానిక్రిందగల భూమికి నీరు అందించుటకు యీ కుడికాలవ వుద్దేశించ బడింది. ఈ విధంగా యీ ప్రాజెక్టుక్రింద 10 గ్రామాలలోగల ఆబీ వరి పొలాలు 4,000 యె. కి నీటి పారుదల లభిస్తుంది. పై 5 ప్రాజెక్టులుకాక క్రమేణా దిగువ మధ్యరకం నీటిపారుదల ప్రాజెక్టులను చేపట్టాలని సంకల్పించ బడింది.

| | వ్యయం లక్షల రూ. లలో | ఆయకట్టు యెకరా లలో |
|---|---|---|
| 1. అమిస్తపూర్ ప్రాజెక్టు-మహబూబునగరం | 7.21 | 690 |
| 2. లక్షణసాగర్-కొల్లాపూర్ | 14.17 | 4150 |
| 3. దొరైపల్లి-కొండగల్లు | 15.00 | 3000 |

వీటిలో లక్షణసాగర్ ప్రాజెక్టు కొల్లాపురం తాలూకాలో వుంది. దీనిపై రెండులక్షలతో జటప్రోలు రాజాచే సంస్థానంకాలంలో పనిజరిపించబడింది. జాగీర్ విలీనం పిమ్మట ఆపని ఆగిపోయింది. దానిని ద్వితీయ ప్రణాళికలో 1958-59లో చేపట్టాలని సంకల్పించ బడింది. దానిని త్రుతీయ ప్రణాళిక సమాప్తినాటికి పూర్తిచేయాలని సంకల్పం.

ఈ ప్రాజెక్టు పూర్తితో, చిన్నరకం నీటిపారుదల ప్రాజెక్టులక్రింద మొత్తం 27,840 యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

### జనాభా

జనాభాలో 100కి రమారమి 76 వంతులు వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తారు. 4.92 శాతం వాణిజ్యంపైనా, 9.82 శాతం వృత్తి (వ్యవసాయేతరమైనది). రవాణాలపైనా జీవిస్తారు. మిగిలినవారు వివిధ యితర పనులతో పొట్టపోసుకుంటారు.

ఈజిల్లాలో రెగ్యులేటెడ్ మార్కెట్లు వున్నాయి. మధ్యరైల్వే సికిందరాబాదు-ద్రోణాచలం మీటర్ గేజ్ మార్గం యీజిల్లా పడమటివైపున వుంది. జెడ్‌చెర్ల, మహబూబునగరాలు ముఖ్యమైన రైలు స్టేషనులైవున్నాయి. ఈజిల్లాలో 2 వున్నత పాఠశాలలు, ఒక శిక్షణా పాఠశాల, ఒకపాలీటెక్నిక్ సంస్థ వున్నాయి. అవికాక యింకా యెన్నో ప్రాథమిక పాఠశాలలు వున్నాయి.

### కొండప్రాంతం

అమరాబాదు పీఠభూమి అని వ్యవహరింపబడే ప్రాంతం యీజిల్లా కొండప్రాంతమై వున్నది. ఇది కృష్ణానదికి వుత్తరానవుంది. ఇక్కడ షెడ్యూల్డు జాతులలో చెంచులు నివసిస్తారు. 1951 జనాభా లెక్కలప్రకారం మహబూబునగరం జిల్లాలో మొత్తం 4,727 మంది చెంచుప్రజలు వున్నారు. అమరాబాదు పీఠభూమి రెండు భాగాలుగా వుంది. దిగువకొసని పంటభూములు వున్నాయి. పెక్కు నివాస గ్రామాలున్నాయి. అవి మైదానాలలో గ్రామాల వలెనే వుంటాయి. అయితే అక్కడక్కడ చిన్నచిన్న చెంచుశివార్లు వుంటాయి. పై ప్రాంతాలు పూర్తిగా అడవిప్రదేశాలు. అక్కడ దాదాపు అంతా చెంచులే నివసిస్తారు. పీఠభూమి యెత్తుప్రదేశాలలోని అడవులలో నివసించే చెంచులు చాలమంది యెప్పటిలా మైదానాలున్న చివరకు వలసవస్తూనే వున్నారు. అక్కడ వారు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తూనో లేక స్వయంగా వ్యవసాయం చేసుకుంటూనో జీవిస్తారు.

## సమాజాభివృద్ధి

ఈ జిల్లాలో 1954 లో సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రవేశపెట్టబడింది. అప్పుడు షాద్ నగర్ తాలూకాకి జా. వి. సే. కేంద్రం కేటాయించబడింది. ఈ జిల్లా 23 అభివృద్ధి కేంద్రాలుగా విభజించబడింది.

## అమలుజరిగే కేంద్రాలు

ఇప్పుడు పని జరిగే కేంద్రాలు, కేటాయింపు సంవత్సరాల వివరాలు దిగువ యివ్వబడినవి :

| | | |
|---|---|---|
| 1. షాద్ నగర్ (ఇప్పుడు సమితి బ్లాకుగా యేర్పాటు చేయబడింది) | | 1954 |
| 2. కల్వకుర్తి | ... | 1955 |
| 3. కొల్లాపూర్ | ... | 1956 |
| 4. దేవరకొండ | ... | 1956 |
| 5. కోండుర్గ్ | ... | 1957 |
| 6. అమంగల్ | ... | 1957 |
| 7. గద్వాల | ... | 1957 |
| 8. బిజ్నపల్లి | ... | 1957 |
| 9. మనోపాడు | ... | 1958 |
| 10. ఆత్మకూరు | ... | 1958 |

ఈ విధంగా అభివృద్ధి కేంద్రాలక్రింద మొత్తం 2791-56 చ.మై. ప్రాంతం వున్నది. 1451 గ్రామాలలోను 6,51,614 జనాభాగల 712 గ్రామాలలో యీ కార్యక్రమం అమలుజరుగుతున్నది. ఈ విధంగా యీ జిల్లాలో రమారమి సగం ప్రాంతంలో యీ కార్యక్రమం అమలుజరుగుతున్నది.

## అడ్ హాక్ పంచాయతీసమితి యేర్పాటు

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకాన్ని అమలు పరచి చూచుటకై షాద్ నగర్ అభివృద్ధి కేంద్రానికి అడ్ హాక్ పంచాయతీసమితి యేర్పాటు చేయబడింది. దానిని 1-7-1958 న ఆంధ్రప్రదేశ్ శాసనసభ అధ్యక్షులు శ్రీ ఎ. కాశేశ్వరరావుగారు ప్రారంభించారు.

సమితికేంద్రంలో 65 గ్రామాలున్నాయి. విస్తీర్ణం 279-7 చ.మై. జనాభా 59,478. సమితిలో మొత్తం 71 మంది సభ్యులు వున్నారు. వీరిలో 10 మంది ఎక్స్-అఫీషియో సభ్యులు. శ్రీ వెంకట ప్రతాపరెడ్డి సమితి అధ్యక్షులు.

## బావులు

ద్వితీయ ప్రణాళిక 3 సంవత్సరాలలోను మొత్తం 126 బావులు త్రవ్వబడినవి. ప్రణాళికా పథకాల క్రింద త్రవ్వబడిన బావులు కాక 1957-58, 1958-59 లలో అప్పులు యిచ్చుటకై ప్రభుత్వం రూ. 1,25,250.00 కేటాయించింది.

1957-58 లో 58 బావులు కేటాయించబడినవి. 63 బావులు మంజూరు చేయబడినవి. కేటాయించిన సొమ్ము రూ. 43,500. ఖర్చుపెట్టబడిన సొమ్ము రూ. 43,234.

1958-59 లో 109 బావులు కేటాయించబడినవి. 130 బావులు మంజూరు చేయబడినవి. కేటాయించబడి, ఖర్చుపెట్టబడిన సొమ్ము రూ. 81,750.

ఈ జిల్లాలో 1,433 గ్రామాలు, 18 పట్నాలు వున్నాయి. 1951 జనాభా లెక్కలప్రకారం యీ జిల్లా జనాభా 14.38 లక్షలు—12.82 లక్షలు గ్రామీణులు, 1.56 లక్షలు పట్నవాసులు.

| పట్నాల జనాభా | మునిసిపాలిటీ | పట్టణకమిటీ |
|---|---|---|
| మహబూబునగరం | 23,827 | — |
| గద్వాల | 16,290 | — |
| నారాయణపేట | 20,707 | — |
| కల్వకుర్తి | — | 5,624 |
| అలంపురం | — | 6,789 |
| వనపర్తి | — | 9,951 |
| మఖ్తాల్ | — | 6,700 |
| కొడంగల్లు | — | 6,715 |
| ఆత్మకూరు | — | 3,867 |
| నాగరకర్నూలు | — | 4,927 |
| కొల్లాపూర్ | — | 6,167 |
| అచ్చంపేట | — | 3,183 |



తాండూరులో జరిగిన హైదరాబాదు జిల్లా ద్వితీయ జిల్లా స్థాయిగోష్ఠి సందర్భంలో 12.11.59 న రాష్ట్ర ముఖ్యమంత్రి ఒక ప్రదర్శనను ప్రారంభించారు

# జిల్లాల వార్తలు

## చిత్తూరుజిల్లా

డిప్యూటీ డెవలప్‌మెంటు కమిషనరు (తూర్పు) శ్రీ ఇ. వి రామరెడ్డి నవంబరు 17 వ తేదీన కాళహస్తి డబుల్-షిఫ్టు విస్తరణ శిక్షణాకేంద్రాన్ని దర్శించారు కేంద్రాన్ని తనిఖీ చేసినపిమ్మట ఆయన సిబ్బంది, శిక్షితుల సమావేశంలో మాట్లాడారు ఆ సందర్భంలో సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిన అవసరాన్ని గురించి నొక్కి చెప్పారు ఆయన కాళహస్తి 1 వ అంచె అభివృద్ధి కేంద్రాన్నికూడా దర్శించి, గ్రామీణులకు ఉత్సాహంతో హృదయపూర్వకంగా సేవ చేయమని అభివృద్ధికేంద్రం సిబ్బందికి సలహాయిచ్చారు

మధ్యాహ్నం ఆయన తిరుచానూరులోని కొయ్య బొమ్మల తయారీకేంద్రాన్ని, పిల్లల ఆటస్థలాన్ని, పార్కుని, మహిళాసమాజాన్ని దర్శించారు. పంచాయతీ అధ్యక్షునితోసహా కొందరు గ్రామస్థులను ఆయన కలుసుకొని అభివృద్ధికేంద్రం సిబ్బందితో సహకరించి తమ పరిస్థితిని చక్క చేసుకోమని చెప్పారు

ఆయన యీ పర్యటనకాలంలో గాజులమండ్యాం, వేపగుంట, పుత్తూరు, కార్వేటినగరం, రాచూరు, తిమ్మసానిపల్లి, వాయల్పాడులను కూడా దర్శించారు

నవంబరు 20 వ తేదీన కాళహస్తి బ్లాకు కార్యాలయంలో జరిగిన సిబ్బంది, జిల్లా ప్లానింగు కమిటీ సమావేశాలలో పాల్గొన్నారు. సాయంకాలం ఆయన వాయల్పాడు కేంద్రంలోని గుర్రంకొండకి వెళ్లారు. 21-11-58 న కడపకి బయలుదేరారు.

## కడప జిల్లా

స్థానిక పరిపాలన ఇనస్పెక్టరు జనరలు, ఎక్స్-అఫీషియో డిప్యూటీ డెవలప్‌మెంటు కమిషనరు అయిన శ్రీ జి. సింహాద్రి నవంబరు 4 న కడపజిల్లా చిన్నచౌకు గ్రామంలో గ్రామనాయకుల శిక్షణాశిబిరాన్ని ప్రారంభించారు. ప్రణాళికాపరంగా నవభారతం అభివృద్ధిలో గ్రామపంచాయతీదారులు, అభివృద్ధి కేంద్రం సిబ్బంది, స్త్రీలు నిర్వహించవలసిన పాత్రని గురించి ఆ సందర్భంలో ఆయన వివరించారు. జిల్లా కలక్టరు, జిల్లా ప్లానింగు ఆఫీసరుకూడా మాట్లాడారు.

## గుంటూరు జిల్లా

రేపల్లె తాలూకా పల్లపట్ల అభివృద్ధికేంద్రం కమ్మవారి పాలెంలో 29-10-58 న స్త్రీల సభ జరిగింది. సభకి శ్రీమతి డి. కమలాంబ అధ్యక్షత వహించారు. ఆ అభివృద్ధి కేంద్రం ఎస్. ఇ. ఓ. (మహిళ) "సర్వోదయ పాత్ర"ని గురించి ప్రసంగించారు. ప్రతి గృహంలోను ఒక్కొక్క 'పాత్ర'ను వుంచి రోజూ దానిలో కొంత డబ్బు వేయమని ఆమె సభలో మహిళలను కోరారు. తరువాత ఆ డబ్బును పోగుచేసి స్త్రీ సంక్షేమ ప్రాజెక్టులపై ఖర్చుపెట్ట వచ్చునన్నారు. ఆ సూచనను అమలు పరుచుటకు— అక్కడి స్త్రీలంతా ఒప్పుకున్నారు.

## కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ 22-11-58 న జిల్లా కలక్టరు అధ్యక్షతన సమావేశమయింది. సమావేశం ప్రారంభంలో కలక్టరు చిన్నమొత్తాల పొదుపువుద్యమం క్రింద యెక్కువసొమ్ము వసూలు కాలేదని చెప్పి యీ వసూలు కార్యక్రమంలో చురుగ్గా పాల్గొనమని అనధికార సభ్యులకు విజ్ఞప్తి చేశారు.

ఆ తరువాత 1918 అక్టోబరు నాటికి జిల్లాలోని వివిధ అభివృద్ధి కేంద్రాలలో జరిగిన పని సమీక్షించబడింది.

కలక్టరు స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమం క్రింద నిర్మితమైన ప్రాథమిక పాఠశాల భవనాల నిర్వహణ ప్రసక్తి తెచ్చి జిల్లాబోర్డుకి తగినడబ్బు లేనందున వాటిని నిర్వహించమని పంచాయతీలకు చెప్పవచ్చునన్నారు. జిల్లాబోర్డు పాఠశాలా భవనాల మరమ్మతులను అశ్రద్ధ చేస్తున్నదని కొందరు సభ్యులు అన్నారు. శా.స. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి సభ్యుల విమర్శలకు జవాబు చెబుతూ అన్నిపనులు చూచుటకు జిల్లాబోర్డుకి వీలుపడ దన్నారు. ఈ విషయంలో ప్రజలుకూడా తమ బాధ్యతను గుర్తించి జిల్లాబోర్డుతో సహకరించాలన్నారు.

ఎమ్ వి. నగర్ అభివృద్ధి కేంద్రంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని సిర్వేల్‌లో నెలకొల్పాలని కమిటీ నిర్ణయించింది. గ్రామీణ గృహవసతి ప్రాజెక్టు పథకం క్రింద గృహవసతి యేర్పాటుకై ఆ కమిటీ సంజమల అభివృద్ధి కేంద్రంలో వరదదెబ్బ తిన్న గ్రామాలను యెన్నింది.

ప్రాంతీయ యేకీకృత శిక్షణా కేంద్రాన్ని కర్నూలులో నెలకొల్పుటకు కూడా నిర్ణయించబడింది

కర్నూలుజిల్లా :- కర్నూలు జిల్లా నీటి పారుదల మహాసభ 23-11-58 న జిల్లాకలక్టరు కార్యాలయంలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశానికి స్థానిక పరిపాలన శాఖా మంత్రి శ్రీ డి. సంజీవయ్య, చీఫ్ ఇంజనీరు శ్రీ ఏ. ఆర్. వెంకటరామన్, జిల్లా కలక్టరు, స్పెషల్ కలక్టరు శ్రీ వై. పిచ్చిరెడ్డిలు కూడా హాజరయారు.

నీటి పారుదల శాఖామంత్రి ప్రసంగిస్తూ జిల్లా నీటి పారుదల మహాసభల ప్రాముఖ్యాన్ని వివరించి, ప్రతి జిల్లాలోను "అవి అనేక నీటి పారుదల సమస్యల పరిష్కారానికి తోడ్పడతాయి"అని అన్నారు. ఇటువంటి మహాసభలలో యిది పదవది. త్వరలోనే

మరి పది జిల్లాలు యిట్టి మహాసభలను జరుపగలవు అని ఆయన అన్నారు.

ఆ తరువాత ఆయన తుంగభద్ర దిగువ కాలవ క్రింది ఆయకట్టు అభివృద్ధికి తీసుకొన్న చర్యలను వివరించి, యీ విషయంలో పని మందకొడిగా సాగుతున్నదన్న వాదనను ఖండించారు. పని ప్రణాళికానుసారం జరుగుతున్న దన్నారు.

కర్నూలు-కడప కాలవ : ఆయకట్టు 3 లక్షల యెకరాల లక్ష్యం సిద్ధించుటకై రైతులు కూడా కృషిచేసి సహకరించాలన్నారు. నీటి పారుదల. రెవిన్యూ శాఖల మధ్య యింకా సమన్వయాన్ని సాధించుటకై చర్య గైకొన బడిన దన్నారు.

ఆఖరిని మంత్రి రమారమి 24 మంది వ్యక్తులు చేసిన ప్రసంగాలలోని విషయాలకు జవాబు చెప్పారు. ప్రభుత్వము, ప్రజల మధ్య యింకా యెక్కువ సహకారం వుంటే యింకా యెక్కువ అభివృద్ధిని సాధించవచ్చు నన్నారు. సంకల్పించిన శ్రీశైలం ప్రాజెక్టు 420 మెగా-వాట్ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయగలదని, దాని పరిశోధనచే పట్ట బడిందని కూడా చెప్పారు. ఈ ప్రాజెక్టును తృతీయ ప్రణాళికలో చేర్చమని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరగలదు.

స్థానిక పరిపాలన శాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య నాగార్జునసాగర్ - కాలువల నీరు మార్కాపురం తాలూకాకు సరఫరా చేయబడాలన్నారు. పెట్టుబడికి తగిన ఫలితం యివ్వదని యిప్పుడు విరమించ బడిన సగిలేరు ప్రాజెక్టు నిర్మాణానికై ప్రజలు సొమ్ము యివ్వగలరని శ్రీ పి. రంగారెడ్డి అన్నారు.

ఈ సందర్భంలో శ్రీయుతులు పి. వెంకట సుబ్బయ్య, పా. స., ఎమ్. సుబ్బారెడ్డి, యె. స. స., కె. విజయభాస్కరరెడ్డి, శా. స., కె. ఓబులరెడ్డి, శా. స., టి. డి. తిమ్మయ్యసెట్టి, శా. స., సి. పి. తిమ్మారెడ్డి, శా. స., ఎన్. వెంకటసుబ్బయ్య, యె. స. స., ఎన్. వెంకటయ్య, శా.స., బి. వి. సుబ్బారెడ్డి, శా.స., ఇ. అయ్యపురెడ్డి, శా. స., ఎన్. కె. లింగం, శా. స., ఎస్. నాగప్ప, రాఘవరెడ్డి, కే. సి. తిమ్మారెడ్డి, హెచ్. హనుమంతరెడ్డి, పి. వి. రంగారెడ్డి, డా. పి. పుల్లారెడ్డి, బి. రామిరెడ్డిగారలుకూడా మాట్లాడారు.

నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖామంత్రి శ్రీ జె.వి. నర్సింగరావు నవంబరు 21 నుంచి 23 వరకూ కర్నూలు జిల్లాలో పర్యటించారు. ఆ సందర్భంలో ఆయన వరదరాజస్వామి ప్రాజెక్టుస్థలం, సిద్ధాపురం చెరువులను, శ్రీశైలం, మార్కాపురాలను, కంభం చెరువును, ముండ్లపాడు, రాచెర్ల, గిద్దలూరు, నంద్యాలలను దర్శించారు. ఈ ప్రదేశాలన్నిటిలోను ఆయన రైతులను కలుసుకుని వారి సమస్యలను, నీటి పారుదల అవసరాలను గురించి తెలుసుకున్నారు. ఆయన బహిరంగసభలలోకూడా ప్రసంగించారు.

## ఖమ్మం జిల్లా

నవంబరు నెలలో గోసంవర్ధనవారంలో ఖమ్మంలో పశుప్రదర్శన జరుపబడింది. ఈ సందర్భంలో సభలో ప్రసంగిస్తూ జిల్లా కలక్టరు పశువులను ఆధునిక పద్ధతులలో పెంచవలసిన ఆవశ్యకతనుగురించి నొక్కి చెప్పారు. ఆ తరువాత జిల్లా పశువైద్యాధికారి పశుగణాభివృద్ధికి తీసుకోవలసిన చర్యలను వివరించారు. కలక్టరు వుత్తమ పశువులకు బహుమతులు పంచిపెట్టారు.

## ముత్యాలగూడెంలో

నవంబరు 17 న ముత్యాలగూడెం (తిర్మలాయపాలెం అభివృద్ధి కేంద్రం)లో జిల్లా పశువైద్యాధికారిచే గ్రామనాయకుల శిక్షణాశిబిరం ప్రారంభించ బడింది. శిబిరం 3 రోజులు జరిగింది. 4 గ్రామాలకు చెందిన 45 మందికి శిక్షణ యివ్వబడింది.

## మహబూబునగరం జిల్లా

మహబూబునగరం జిల్లా వార్షిక నీటి పారుదల మహాసభ జిల్లా కలక్టరు కార్యాలయంలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జె. వి. నర్సింగరావుచే ప్రారంభించబడింది. ఈ మహాసభకి శాసనసభ్యులు, తాలూకాల ప్రతినిధులు హాజరయ్యారు.

జిల్లాకలక్టరు మంత్రిగారికి స్వాగతం యిచ్చారు.

ఇదివరకూ ఆంధ్రలో నీటిపారుదల సలహా సంఘాల సమావేశాలు జరిగేవనీ, అందువల్ల పని బాగా జరగేది కాదని మంత్రి మహాసభను ప్రారంభిస్తూ అన్నారు అందువల్లనే నీటిపారుదల సంప్రదింపుల సంఘాలు యేర్పాటు చేయబడినవన్నారు మొదటి సభ చిత్తూరులో జరిగిందనీ, యితర జిల్లాల్లో కూడా అది జయప్రదమైనదని అన్నారు అట్టి సమావేశంలో చెరువుల మరమ్మతులు, ఆనకట్ల నిర్మాణానికి సంబంధించిన యిబ్బందులు చర్చించబడతాయన్నారు ఆంధ్రలో 43 8 శాతం నీటి పారుదల, విద్యుచ్ఛక్తులపై ఖర్చు పెట్టబడుతున్నదన్నారు నాగార్జున సాగర్ వంటి పెద్ద ప్రాజెక్టులు ముఖ్యమేకాని చిన్న రకం ప్రాజెక్టులు సత్వరమైన చక్కని ఫలితాలను యిస్తాయి కేంద్రంనుంచి లభించే సొమ్ముతో గండ పడిన చెరువులు యెలా మరమ్మతు చేయబడుతున్నాయో మంత్రి వివరించారు కంట్రాక్టులను పంచాయతీదారులకు, ఆయకట్టుదారులు మున్నగు వారికిమ్మని ఆయన సభికులకు విజ్ఞప్తిచేశారు. రూ 24 లక్షల వసతితో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రూ 71 లక్షల పెద్ద కార్యక్రమాన్ని తయారు చేసిందని, యిది తొలి పంచవర్ష ప్రణాళికలో ఖర్చయినదానికంటె మూడురెట్లు యెక్కువ అని ఆయన అన్నారు ఇంచుమించు రూ 15 లక్షల కంట్రాక్టు భారత్ సేవక్ సమాజ్ కి యివ్వవలసివుంది ప్రజలు యెక్కువగా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాల అమలులో ప్రజలు యితోధికంగా సహకరించాలని నేటి అవసరం, అధికంగా అదేనని చెబుతూ ఆయన ప్రసంగాన్ని ముగించారు

మధ్యాహ్నం సమావేశంలో, గండిపడిన చెరువులు వగైరాల మరమ్మత్తు యీ సంవత్సరంలో జరుపబడుతుందని మంత్రి హామి యిచ్చారు

సత్కృషికి పోటీ దృక్పథం వుండాలని ఆయన అన్నారు 10-100 యెకరాల భూమిని రెవిన్యూ సిబ్బంది నిర్వహించాలని, పి డబ్ల్యు డి మరమ్మతు చేశాక సాంపిల్ చెకింగు వుండాలని అన్నారు ఆయన అప్పుడప్పుడు చేసే తనిఖీలవల్ల సూపరింటెండింగు ఇంజనీర్లు, చీఫ్ ఇంజనీర్ల కార్యాలయాలలో వాయిదాలో వున్న కేసులు పరిష్కారం అవుతాయి రైతులు, పథకాలు, ప్రణాళికలను గురించి తెలుసుకుని జయప్రదంగా వాటిని అమలు పరచుటలో బాగా శ్రద్ధ వైకొనాలి

## నల్గొండ జిల్లా

సమాజాభివృద్ధి కార్యక్రమంతో సంబంధంగల జిల్లా అధికార్లు నక్రేకాల్ అంచె 1 బ్లాకులో నవం



రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు 3-11-58 న శ్రీకాకుళంలో జిల్లా కలక్టరు కార్యాలయంలో వరద బాధితులకు బట్టలను పంచిపెడుతున్న దృశ్యం.

బరులో పర్యటించారు వారు పెర్కకందరం, కాడ ... ర్తి, ఇండ్లూరు గ్రామాలను సందర్శించారు.

జిల్లా కలక్టరు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు (నీటి పారుదల బ్రాంచి) బ్లాకు అభివృద్ధి అధికారులతో కలిసి పెర్కకందరానికి వెళ్ళగా జిల్లా ప్లానింగు ఆఫీసరు మున్నగువారు ఇండ్లూరుకి వెళ్లారు.

కలక్టరు జపాను పద్ధతి వరిసాగులో నున్న పొలాలను, యింటితోటలను పెంటయెరువు గుంటలను తనిఖీ చేశారు. పొగరాని పొయ్యిపై వంట చేస్తున్న స్త్రీతో ఆయన స్వయంగా మాట్లాడి, దాని లాభాలనుగురించి గ్రామంలోని యితర స్త్రీలకి చెప్పమని సలహాయిచ్చారు.

ఆ తరువాత గ్రామీణుల సభలో మాట్లాడుతూ ఆయనరాబీ ఆహారోత్పత్తి ఉద్యమం ఆశయాలను వివరించారు. ఉత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, పచ్చియెరువులను బాగావాడమని, జపాను పద్ధతిలో యెక్కువనేలను సాగుచేయమని ఆయన ప్రజలను వుద్బోధించారు. రైతులురాబీ వుద్యమంలో పోటీదృక్పథంతో పాల్గొనాలని, గ్రామానికి మొదటి బహుమతిని సంపాదించుటకు ప్రయత్నించాలని సలహాయిచ్చారు. భూములన్నిటిని పూర్తిగా జపాను పద్ధతి వరిసాగు క్రిందికి తేబడిన గ్రామానికి కూడా బహుమతియివ్వబడుతుందని చెప్పారు.

ఇండ్లూరు గ్రామంలో శ్రమదానంతో రోడ్డు నిర్మించబడింది. అభివృద్ధి కేంద్రం ప్రారంభించబడిన పిమ్మట అక్కడ ఒక సహకార సంఘం నెలకొల్పబడింది. అక్కడికి వెళ్లిన జిల్లా అధికారులు యీ విషయాలను తెలుసుకున్నారు.

సాయంకాలం జిల్లా అధికార్లు జిల్లా కలక్టరు అధ్యక్షత్యన సమావేశమై గ్రామాలలో తమ సమిష్టి పర్యటన అనుభవాలను గురించి చర్చించారు. హరిజనేతర సాంఘిక కార్యకర్తలు తమ యిళ్లను హరిజన కాలనీలలో యేర్పాటు చేసుకోవాలని బి. డి. ఓ. లు వారికి నచ్చచెప్పాలనికూడా నిర్ణయించబడింది. అస్పృశ్యతా నివారణకు అది చాలావుపకరిస్తుందని కలక్టరు అన్నారు.

## నెల్లూరు జిల్లా

నవంబరు 13 న కావలిలో నెల్లూరు జిల్లా కలక్టరు అధ్యక్షతన కావలి తాలూకా పంచాయతీ మహాసభ జరిగింది.

సమాజాభివృద్ధికై కృషిచేయమని, దేశాన్ని యెదుర్కొనే తీవ్ర సమస్యల పరిష్కారంలో ప్రభుత్వంతో సహకరించమని కలక్టరు అధ్యక్షోపన్యాసంలో పంచాయతీ అధ్యక్షులను కోరారు. ప్రజాస్వామ్యవిజయం పంచాయతీల సామర్థ్యంపై ఆధారపడివుంటుందని చెబుతూ తమ పనిని సమర్థంగా చేయమని వారుద్బోధించారు. అభివృద్ధి కార్యక్రమాలకు యెప్పుడూ డబ్బే ప్రధానంకాదని, పూనిక, సమష్టికృషి చాలా అవసరమని అంటూ ప్రసంగాన్ని ముగించారు.

## ఇందుకూరుపేట బ్లాకు

30-9-1958 న జగదేవిపేటలో హరిజన్ డే జరుపబడింది. హరిజనవాడ వీధులు, బావులు బాగు చేయబడినవి. మురుగు నీరుగుంటలు త్రవ్వబడినవి. పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఎమ్. శంకరనాయుడు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. ఆరోజు ప్రాముఖ్యం ప్రజలకు తెలియజేయబడింది. శుచిశుభ్రాలుగల యింటికి, మిక్కిలి ఆరోగ్యకరమైన శిశువుకి బహుమతులు యివ్వబడినవి.

సెప్టెంబరులో మాదరాజు గూడూరు, జగదేవి పేటలలో రెండు గ్రామసహాయకుల శిక్షణాశిబిరాలు యేర్పాటు చేయబడినవి. 2 శిబిరాలలోను వ్యవసాయం, పశుపోషణ, చిన్నరకం నీటిపారుదలల్లో 100 మందికి శిక్షణ యివ్వబడింది. మొదటి శిబిరాన్ని మాదరాజు గూడూరు పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఏ. వెంకటసుబ్బారెడ్డి, రెండవ శిబిరాన్ని శా.స. శ్రీ వి. కోదండరామరెడ్డి ప్రారంభించారు. వీటి నిర్వహణలో నెల్లూరుజిల్లా వ్యవసాయాధికారి, పశువైద్య అధికారులుకూడా పాల్గొన్నారు.

## జిల్లా ప్లానింగు, అభివృద్ధికమిటీ

నల్గొండజిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ 19-11-58 న నక్రేకాల్‌లో సమావేశమయింది.

జిల్లా కలక్టరు అధ్యక్షత వహించారు. సభ్యులు జిల్లా అభివృద్ధి కార్యక్రమాలకి సంబంధించిన వివిధ సమస్యలను చర్చించి, గడచిన సమావేశంలో ఆమోదింపబడిన తీర్మానాలపై తీసుకొనబడిన చర్యలను సమీక్షించారు. బ్లాకు ప్లానింగు కమిటీ సభ్యులలో ఒక్కొక్కరికి జిల్లాలో ఒక్కొక్క గ్రామాన్ని బి. డి. ఓ. లు కేటాయించారని కలక్టరు కమిటీకి తెలియచేశారు. జిల్లా స్థానికాభివృద్ధి పనులక్రింద యెక్కువ సొమ్ము రూ. 50,000 వరకూ కేటాయించబడినదని చెబుతూ ఆ సొమ్మును వుత్తమంగా వినియోగించమని అనధికార సభ్యులను కోరారు. 'బోరి' బావులకై 3 డ్రిల్లింగు యూనిట్లు సమకూర్చబడినవన్నారు. శాసనసభ వుపాధ్యక్షులు శ్రీ కొండా లక్ష్మణబాపూజీకూడా కమిటీ సభ్యుల సమావేశంలో మాట్లాడారు.

జిల్లా పా. అ. కమిటీ తరువాతి సమావేశం సూర్యాపేటలో 22-1-1959న జరపాలని నిర్ణయించబడింది.

## నిజామాబాదు జిల్లా

రాబీ, తాబీ వుద్యమం జొన్న, మొక్కజొన్న, శనగలు, గోధుమల వుత్పత్తికి ప్రత్యేక ప్రాధాన్యాన్నిస్తూ జిల్లాలో నిర్ణీతమైన 500 గ్రామాలలో ప్రవేశపెట్టబడింది. మొత్తం 160 వుద్యమదళాలు యేర్పాటు చేయబడ్డాయి. వీటిలో వ్యవసాయ విస్తరణ కార్యకర్తలు, ఉత్తమ కృషికులు వున్నారు. ఈ దళాల సిబ్బందికి బాగా శిక్షణ నిచ్చినపిమ్మట వారు వివిధ మండలాలకి కేటాయించబడ్డారు.

రాబీ, తాబీ వుద్యమం సందర్భంలో 732 సమావేశాలు, 10 ఫీల్డు ప్రదర్శనలు యేర్పాటు చేయబడ్డాయి. వుత్తమ విత్తనాలు, పిల్లి పెసరవంటి పచ్చియెరువు విత్తనాల ప్రాముఖ్యం నొక్కిచెప్పబడింది.

37310 యెకరాలలో జల్లుటకై 4041 మ. జొన్న విత్తనాలు పంపిణీచేయబడినవి. ఈ వుద్యమం క్రింద రమారమి 36000 కమతాల సమస్యలు పరిష్కరింపబడ్డాయి. ఇంచుమించు 32 టన్నుల నత్రజని యెరువులు, 73 టన్నుల భాస్వరం యెరువులు, 90 మ. పచ్చి యెరువు పంపిణీ చేయబడినవి. మొక్కల రక్షణ క్రింద 7207 మ. జొన్న విత్తనాలు స్మటీరాకుండా చేయబడినవి. రూ. 3900 తక్కావీ అప్పులు మంజూరు చేయబడినవి.



# ప్రశ్నోత్తరావళి

80వ. ప్రశ్న :- శ్రీ బి. వి అప్పారావు, వాల్తేరు.

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నవి? ఎన్ని ఫ్యాక్టరీకు లైసెన్సులు యివ్వ బడినవి ?

జవాబు :- ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో రెండు సిమెంటు ఫ్యాక్టరీలువున్నవి. వీటినుండి 2,66,600 టన్నుల సిమెంటు ఉత్పత్తి అవుతుంది. కొత్తగా లైసెన్సు యిచ్చినవి 9. వీటి మొత్తం ఉత్పత్తి శక్తి 15,97,300 టన్నులు.

81వ. ప్రశ్న ;- శ్రీ భైరవ భోట్ల శేషగిరిరావు, ఆత్మకూరు, మధిరతాలూకా. కొత్తగా ఏర్పర చిన ఖమ్మంజిల్లాలో, తాలూకా వారీ జనాభా వివరాలు చెప్పండి.

జవాబు :- ఖమ్మం జిల్లాలోని 5 తాలూకాల జనాభా వివరాలు.

| | |
|---|---|
| బూర్గుంపాడు , | 43,590 |
| ఖమ్మం : | 235,078 |
| మధిర : | 170,661 |
| పాల్వంచ : | 131,310 |
| ఎల్లందు : | 119,367 |

82వ. ప్రశ్న :- శ్రీ టి చెంచు రామయ్య, ఆంధ్ర విశ్వవిద్యాలయం. వాల్తేరు; వ్యవసాయంలో సామర్థ్యాన్ని పెంపొందించి, తద్వారా దేశం లోని ఆహార క్లిష్టతను తగ్గించటానికి భూసంస్క రణలు ఎంతవరకు సహాయ పడగలవు ?

జవాబు :- కవులు దారుకు భద్రత కల్పించి, కౌలు రేట్లు తగ్గించటం ద్వారా, భూమిని అభివృద్ధి చేయటానికీ, వ్యవసాయోత్పత్తిని అధికం చేయ టానికీ అతనికి ఉత్సాహం కలిగించుటమే భూసంస్కరణలఉద్దేశం. భూమిని మరింత విశాల మైన ప్రాతిపదికమీద తిరిగి పంపిణీచేసి, తద్వారా ఆదాయాలలో, సంపదలో గల హెచ్చుతగ్గులను క్రమేణా తగ్గించటమనే సాంఘిక లక్ష్యసాధనకు భూసంస్కరణల విధానం దోహదకారి అవుతుంది. ఉన్నత స్థాయి సామర్థ్యం, ఉత్పత్తి శక్తులతో కూడి వ్యవసాయిక ఆర్థిక విధానమును రూపొం దించుటయే భూసంస్కరణల అంతిమ లక్ష్యం. ఉత్పత్తి అధికమైతే, ఆహార సమస్య దానంతట అదే తగ్గిపోతుంది.

83వ. ప్రశ్న :- శ్రీ జె. విశ్వనాథం, ఆగపల్లి, ఇబ్రహీంపట్నం.

ఆంధ్రప్రదేశ్‌లో ఏ ఏ భాషలలో ఎన్ని వార్తా పత్రికలు నడుస్తున్నవి ?

జవాబు :- వార్తా పత్రికల రిజిస్ట్రారు ప్రకటించిన సంఖ్యా వివరాలను బట్టి, ఆంధ్రప్రదేశ్‌లో 254 వార్తా పత్రికలు ప్రచురింప బడుతున్నవి. యిందులో నూరింట 57 పత్రికలు తెలుగు లోనూ, 15 పత్రికలు ఉరుదులోనూ. 7 పత్రికలు ఆంగ్లంలోనూ, ౬ పత్రికలు హిందీలోనూ, ప్రకటితమవు తున్నవి. ఇవికాక 4 మరాటీ పత్రికలు, 43 ద్విభాషా, బహుభాషా పత్రికలు కూడా వున్నవి.

84వ. ప్రశ్న :- శ్రీ పి. రమేష్, దేవిరోడ్, నిజామాబాద్. ఆంధ్రప్రదేశ్‌లో చదరపు మైలు 1కి జన సాంద్రత ఎంత ?

జవాబు :-మన రాష్ట్రంలో జనసాంద్రత: చ. మై. 1కి 295.

85వ. ప్రశ్న :- శ్రీ యన్. బ్రహ్మానందం, అబ్బినేని గుంట పాలెం, గుంటూరు.

ఆంధ్రప్రదేశ్ లో ఏ జిల్లాలో జనాభాఎక్కువ? గుంటూరు జిల్లా జనాభాఎంత ?

జవాబు :- గుంటూరు జిల్లా జనాభాలో అగ్రస్థానం వహిస్తున్నది. ఈ జిల్లా జనాభా 2,54!,9 16·

86వ. ప్రశ్న :- శ్రీ బి. శేషగిరిరావు, కొత్తగూడ, హైదరాబాదు జిల్లా.

మన రాష్ట్రంలో ఎన్ని జవుళి మిల్లులున్నవి?

జవాబు :- రాష్ట్రంలో 3 కాంపోజిట్ మిల్లులు, 9 నేత మిల్లులు వున్నవి.

87వ. ప్రశ్న :- వజ్రాలు మొదలగు రాళ్ళను గురించి మాట్లాడుతూ ప్రజలు అవి యిన్ని కారట్ల తూకం వున్నా యంటారే - అసలు కారట్ అంటే ఎంత ?

జవాబు :- కారట్ అంటే 200 మిల్లి గ్రాములు.





చిట్యాల సాంఘిక సంక్షేమ కాలనీ

నల్లగొండ జిల్లాలో

# "సంజీవి నగర్"

నల్లగొండ తాలూకాలో చిట్యాల గ్రామంలో "సంజీవినగర్" అనే పేరుతో నిర్మించిన సాంఘిక సంక్షేమ కాలనీకి అక్టోబరు 14వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. పరిసర గ్రామాల ప్రజలు సుమారు 2 వేల మంది మహాసభకు హాజరైనారు స్థానిక పరిపాలన, కార్మిక శాఖామాత్యులు అధ్యక్షత వహించారు. ప్రణాళికలు, అభివృద్ధిశాఖామంత్రి, విద్యా, సాంఘిక సంక్షేమ శాఖమంత్రి, అనేకమంది అధికార, అనధికార ప్రముఖులు సభలో పాల్గొన్నారు.

కాలనీలోని హరిజన పౌరులు, స్థానిక నాయకులు ముఖ్యమంత్రిని, యితర మంత్రులనూ పుష్పమాలాలంకృతులను చేశారు. పంచాయతీ అధ్యక్షులు శ్రీ నరసయ్యగారు స్వాగతపత్రం సమర్పించారు. ఒక మాధ్యమిక పాఠశాల పర్పాటు చేయవలసిందనీ, విద్యుచ్ఛక్తి సప్లై చేయవలసిందనీ, మిగిలిన 25 యిండ్లకు ఆర్థికసహాయం చేయవలసిందనీ శ్రీ నర్సయ్యగారు విజ్ఞప్తి చేశారు.

హరిజనులకు గృహ యాజమాన్యపు సర్టిఫికెట్లను, సరీసుగా కట్టడపు పనిచేసిన మేస్త్రీలు శ్రీ మల్లయ్య, రాజయ్యగార్లకు అంగవస్త్రాలనూ ముఖ్యమంత్రి బహూకరించారు.

ముఖ్యమంత్రి తమ ప్రారంభోపన్యాసంలో గృహాలను పరిశుభ్రంగా వుంచుకోవలసిందనీ, మరమ్మ

తులు వగైరా, ఆర్థికసహాయం అడుగకుండా, సకాలంలో చేయించుకోవలసిందనీ, హరిజనులకు విజ్ఞప్తి చేశారు. గ్రామంలోని యితర అవసరాలనుగూర్చి ప్రస్తావించి, అభివృద్ధి కార్యక్రమాల్లో ప్రజలు మనస్ఫూర్తిగా పాల్గొని పనిచేస్తే, యితర అవసరాల విషయంగూడా సుముఖంగా పరిశీలించబడగలదని హామీయిచ్చారు. చిట్యాలగ్రామంలో ప్రజల ఉత్సాహం ఎక్కువగా కనిపిస్తున్నందున, యీ దారిలో ఎప్పుడు ప్రయాణంచేసినా యీగ్రామం తమమనస్సులో మెదులుతూనేవుంటుందని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

స్థానిక పరిపాలన, కార్మికశాఖా మాత్యులు తమ అధ్యక్షోపన్యాసంలో ప్రజలందరు ముందుకు వచ్చి అభివృద్ధికార్యక్రమాల్లో ఐచ్ఛికంగా పాల్గొని చొరవతో పనిచేయవలసిందని విజ్ఞప్తి చేశారు.

మొత్తం ప్రభుత్వ ఖర్చుతో నిర్మించిన యిండ్లు తమకు లభించగలవని హరిజనులు అనుకుంటూ వుండవచ్చు. కాని అది నిజంకాదు. ప్రభుత్వం కొంతవరకు సహాయం చేయగలదు గాని, ఖర్చు అంతా భరించదని ఆయన పేర్కొన్నారు. గాంధీ జయంతి వారోత్సవాల సందర్భంగా తాము యీ జిల్లాలో పాదయాత్ర జరిపినప్పుడు వివిధ గ్రామాలలోని సమస్యలను గురించి తాము తెలుసుకొన్న విషయాలనుకూడా మంత్రిగారు ప్రస్తావించారు. ఈయిబ్బందులను తొలగించటానికి, అన్ని స్థాయిలలోనూ తగుచర్యలు గైకొనబడుతున్నవని ఆయన సూచించారు.

జిల్లా కలెక్టరు శ్రీ శ్రవణకుమార్ ఐ. ఎ. యస్. గారు తమ ప్రసంగంలో మంత్రులకు కృతజ్ఞతలర్పించారు. తాము వారిని కాలనీ అంతటా త్రిప్పి చూపించి, కట్టిన యిండ్లు, వాటి డిజైన్లు, ఖర్చు అంచనాలు, ప్రస్తుతం వున్న వసతి, మున్ముందు వంటగది, వరండాలను పెంచే, ఏర్పాట్లు అన్నీ వివరించామని పేర్కొన్నారు. రాతి పునాదులతో 25 ఒంటిగది యిండ్లు పూర్తి అయినవనీ, గోడలు మట్టి, యిటుకతో నిర్మించారనీ, గోడలకు సున్నం ప్లాస్టింగ్ చేయబడిందనీ, దేశవాళీ పెంకుతో కప్పు వేశారనీ వివరించారు. ప్రతియింటికి అయినఖర్చు రూ. 800 లకుగాను రూ. 500 ప్రభుత్వం భరించిందనీ, మిగిలింది శ్రమరూపంలోనూ, సామగ్రి రూపంలోనూ హరిజనులు భరించారనీ ఆయన తెలియజేశారు. కొత్తగా మంచినీటి బావికూడా ఏర్పాటు చేయబడింది. ప్రతియింటికీ ప్రత్యేకంగా వాటర్ సీల్ లెట్రిన్ వుంది. కాలనీలో వయోజనుల రాత్రి పాఠశాల, తోళ్ళ సహకారసంఘం ఏర్పాటు చేయబడినవి.

## పథకం వివరాలు

భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కలిసి ఉమ్మడిగా నిర్వహించే సంక్షేమ పథకాన్ని అమలు పరచటానికి చిట్యాల గ్రామం ఎన్నుకోబడింది. ఈ గ్రామం హైదరాబాద్-బందరు. జాతీయ రహదారి ప్రక్కన వుంది. ఈ పథకం 1957-58 లో రూ. 16061.77 ల ఖర్చుతో ప్రారంభమైంది. స్థిరనివాస కల్పన, ఆర్థికాభివృద్ధికి ఉద్దేశించిన చర్యలలో యిది ఒకటి. 1958-59 లో ఈ పథకం అమలు పరచటానికి యింకా రూ. 4,300 లు సమకూర్చబడింది.

ఈ పథకంమీద మొత్తం ఖర్చు రూ. 21,461.77 లు. వివరాలు :

(ఎ) కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన పథకం క్రింద స్థిరనివాసకల్పన : 1957-58

| | రూపాయలు |
|---|---|
| 1. 25 యిండ్లు నిర్మించటానికి గ్రాంటు. | 12,500=00 |
| 2. భూమి మరమ్మతుల ఖర్చు-లోపలి రోడ్లు | 375=00 |
| 3. ఆటస్థలం సామగ్రి - కమ్యూనిటీ రేడియో సెట్టు | 586=77 |
| 4. మురుగు దొడ్లు-మురుగు కాల్వలు | 1,000=00 |
| 5. మంచి నీటి బావి | 1,000=00 |
| 6. నాలుగు పంట చెరువుల మరమ్మతులు | 1,600=00 |

(బి) 1958-59లో

| | |
|---|---|
| ట్రాలీలో బిగించిన మొబైల్ ఆయిల్ ఇంజను (కమ్యూనిటీ సెట్టు) | 2,100=00 |
| మొత్తం | 19,161=77 |

సి) సాధరణ పథకాలు, సహాయక గ్రాంట్ల పథకాల క్రింద ఆర్థిక సహాయం :

| | |
|---|---|
| 1. తోళ్ల కార్మికుల పారిశ్రామిక సహాకార సంఘానికి మంజూరు చేసిన గ్రాంటు | 2,000=00 |
| 2. కాలనీలో వయోజన రాత్రి పాఠశాలకు విద్యావిషయిక పరికరాలు. | 150=00 |
| 3. వెనుకబడిన వర్గాలకు, షెడ్యూలు కులాలకు స్కాలర్‌షిప్‌లు, యితర విద్యా సౌకర్యాలు. | 150=00 |
| మొత్తం | 21,461=77 |

ఈ పథకం క్రింద మంజూరైన సబ్సిడీలన్నీ హరిజనుల కొరకు యిచ్చిన పూర్తి గ్రాంట్లు. సక్రమ పద్ధతులలో, పొదుపుగానూ, త్వరగానూ పనులు జరుగుటకై యీ పథకాన్ని ఒక సంఘం ద్వారా అమలు పరచాలని హరిజనులు కోరారు. జిల్లా అధికారులు, అనధికార ప్రముఖులతో, జిల్లా కలెక్టరు అధ్యక్షత క్రింద ఆచరణ సంఘం ఏర్పాటు చేయబడింది. ఈ పథకం క్రింద లభించిన ధన రూపపు గ్రాంటు మొత్తాలనన్నింటినీ హరిజనులు యీ సంఘ పరంచేశారు.

చిట్యాల పుర ప్రముఖులు కూడా ముందుకు వచ్చి ఆదుకున్నారు. కాలనీ నిర్మాణానికి సామగ్రి వగైరా వారు విరాళంగా యిచ్చారు. నిర్మాణం జరిగినంత కాలం హరిజనులు ఉచితంగా పనులుచేసి తోడ్పడ్డారు. ఈ కాలనీ నిర్మాణ కార్యం విజయవంతంగా ముగిసిందంటే-దానికి కేవలం పెట్టుబడి పెట్టిన డబ్బే కారణం కాదు. చిట్యాల ప్రజలు చూపిన స్వయంకృషి, శ్రద్ధ, మొదలగు కార్యదీక్షా లక్షణాలకు యీ కాలనీ ఒక చిహ్నంగా నిలుస్తుంది. గ్రామ పంచాయితీ వారు 5 వీధి దీపాలను, రెండు చెత్త చెదారం వేసే డబ్బాలను కాలనీకి విరాళం యిచ్చారు.

కాలనీలో యిండ్ల సంఖ్య 50 వరకు పెంచి, దీనిని యింకా విస్తృత పరచాలని ఉద్దేశించబడుతున్నది. సాధారణ పథకాల క్రింద, కేంద్ర పథకాల క్రింద రాబోయే కేటాయింపుల మొత్తాలతో యీ విస్తరణ జరపాలని సంకల్పం. గ్రంథాలయంగా, పంచాయితీ కార్యాలయంగా, కమ్యూనిటీ హాలుగా ఉపయోగపడే నిర్మాణం మంజూరు కావటం నిజంగా అదృష్టమనే చెప్పవచ్చు. స్థానిక అభివృద్ధి కార్యక్రమాల క్రింద యీ భవనం యీ గ్రామానికి కేటాయించబడింది. నల్లగొండ డిప్యూటీ కలెక్టరు, తాసీల్దారు అప్పుడే చిట్యాల గ్రామస్థులవద్ద నుండి రొక్కం విరాళాలు సేకరించారు, నవంబరు 14వ తేదీన-అంటే భారత ప్రధాని పుట్టిన రోజున-ఆంధ్రప్రదేశ్ హోంశాఖా మాత్యులు యీ కమ్యూనిటీ హాలు భవనానికి శంఖు స్థాపనచేశారు. ఆ రోజునే కాలనీకూడా ప్రారంభించబడింది. ఆర్థిక, సాంఘిక అభివృద్ధి సాధనకొరకై సమానతాభావంతో స్వయం కృషితో, ఆత్మ విశ్వాసంతో కృషిచేస్తామని గ్రామస్థులు, ముఖ్యంగా కాలనీలోని హరిజనులు శపథం చేశారు. అక్కడి ప్రజల అభీష్టము ననుసరించి, ముఖ్య మంత్రి అనుమతితో యీ కాలనీకి "సంజీవి నగర్" అని నామకరణం జరిగింది.



# సర్వకోట బ్లాకు అభివృద్ధి

సర్వకోట ప్రధమస్థాయి బ్లాకు శ్రీకాకుళం జిల్లాలోనిది. దీని విస్తీర్ణ 95, 923-20 యకరాలు, అంటే 149.88 చ. మై. బ్లాకులోని గ్రామాల సంఖ్య 169. జనాభా 72,805. ఈ బ్లాకులో నివసిస్తున్న కుటుంబాల సంఖ్య 14,560.

1958 సెప్టెంబరు 30వ. తేదీవరకు యీ బ్లాకులో జరిగి అభివృద్ధి వివరాలు :—

## వ్యవసాయం

ఇంతవరకు 5613 మణుగుల విత్తనాల వడ్లు, 428 మణుగుల జొన్న విత్తనాలు, 436 మణుగుల వేరుశెనగ విత్తనాలు రైతులకు సప్లైచేసే ఏర్పాటు జరిగింది.



కురీదింగి గ్రామస్థులు శ్రమదానంలో రోడ్డు నిర్మిస్తున్న దృశ్యం.

## రసాయనిక ఎరువులు

రసాయనిక ఎరువుల వాడకం పథకం క్రింద సప్లై చేసిన వాటితోసహా, యింతవరకు మొత్తం 5425 మణుగుల ఎరువులు రైతులకు సప్లై చేయబడినవి. కాగువాడ గ్రామంలో ఒక ఆదర్శ క్షేత్రం స్థాపించి, దానిలో వివిధ ఆధునిక వ్యవసాయ విధానాలను అమలు పరుస్తున్నారు. గ్రామానికి 10 మంది రైతులను ఏరి, ఒక్కొక్కరికి ఒక ప్యాకట్ సెస్బేనియా విత్తనాలు సప్లైచేశారు. నారుమళ్ళు పెంచబడినవి. పొలాలగట్ల ప్రక్కన స్థలంలో విత్తనాలకోసంనారు నాటారు. గ్లిరిసీడియా గింజలు 3 పౌనులు సంపాదించి వాటిని చల్లినారు పెంచారు. వరి పొలాలలో పెద్ద పెద్ద గట్లమీద యీ నారు మొక్కలు నాటారు. యింతవరకు సుమారు 1066 యకరాల్లో పచ్చి ఎరువు వాడబడింది. 3 నెలల కాలంలో యిరిగేషన్, భూమి క్రొత్త సాగు మొదలగు పనులకు బ్లాకు నిధులలో నుండి రు 9450 లు వెచింప బడింది.

## పశుపోషణ

19 మేలుజాతి పశులు సప్లై చేయబడినవి. ఒక పశువైద్య ప్రథమ చికిత్సాకేంద్రం ఏర్పాటు చేయబడింది.

## ఆరోగ్యం - పారిశుధ్యం

పాత బావులు 3 బాగుచేయ బడినవి. 1205 గజాల కచ్చా మురుగు కాల్వలు నిర్మించారు.

## విద్య, సాంఘికవిద్య

4 సాధారణ పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి. నవజవాన్ కిసాన్ క్లబ్బులు, భజన మండలులు వంటి ప్రజా సంస్థలు 27 ఏర్పాటు చేయబడినవి, ఈ 3 నెలల కాలంలో మూడు కమ్యూనిటీ విశ్రాంతి కేంద్రాలు స్థాపించ బడినవి. ఒక మేళా ప్రదర్శనం జరిగింది.

బ్లాకు ప్రాంత మంతటా రాబి ఉద్యమం ఉద్ధృతంగా కొనసాగింది, రైతులకు యీ సందర్భంగా అవసరమైన సౌకర్యాలు అన్నీ చేయబడినవి.

లోగడనే ప్రారంభించబడిన 3 కోళ్ళ పెంపకం కేంద్రాలకు కోళ్ళుసప్లై జరుగుతుంది. ప్రజల విరాళాలతో ఒక పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రం ప్రారంభించ బడుతుంది. పాఠశాలలు లేని గ్రామాల్లో 7 పాఠశాలలు క్రొత్తగా ప్రారంభ మవుతై. 10 ప్రాథమిక పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడుతవి. యివికాక, ఆరోగ్యం, పారిశుద్ధ్యం కార్యక్రమాల క్రింద యింకా చాలా పనులు ప్రారంభించటం జరుగుతుంది. కొత్తపల్లిలో ప్రజారోగ్య కేంద్రం పర్పాటు అవుతుంది.

మొత్తం 60 పంచాయతీలకుగాను యింకా 16 పంచాయతీలలో ఎన్నికలు జరగాలి. అన్ని గ్రామాల్లో గ్రామ ప్లానింగ్-అభివృద్ధి సంఘాలు పర్పాటు చేయబడినవి. అన్ని గ్రామాలలో నేషనల్ సేవింగ్స్ చందాలు వసూలు చేయటానికి ఉపసంఘాలు పర్పాటవుతున్నవి. పాదరక్షల పారిశ్రామిక కేంద్రం, బుట్టలతయారీ కేంద్రం పర్పాటుచేయటానికి సన్నాహాలు జరుగుతున్నవి.

ప్రజలు, 1 మైలు 7 ఫర్లాంగుల 137 గజముల దూరం కచ్చారోడ్లు నిర్మించారు. 1 ఫర్లాంగు 110 గజాల దూరం యిప్పటి రోడ్లను బాగుచేసుకున్నారు. జపాను వరిసాగు పద్ధతి, పచ్చి ఎరువుల ఉద్యమాలలో ప్రజలు ఉత్సాహంతో పాల్గొన్నారు.

గ్రామీణప్రజల ముఖ్యావసరాలైన యిరిగేషన్ వసతులు, మంచినీటి సౌకర్యాలు, రహదార్లు మొదలగు వాటిని దృష్టిలో వుంచుకొనే అభివృద్ధి కార్యక్రమాలు సాగుతున్నవి. ఈ కార్యక్రమాల ప్రభావం 4360 కుటుంబాలకు లాభాదాయకంగా ప్రసరించింది.

ఈ 3 నెలలకాలంలో ఒక నవజవాన్ కిసాన్ క్లబ్, 4 సీనియర్ యువజనక్లబ్బులు పర్పాటైనవి.

ఈ సంవత్సరం పర్పడిన అనావృష్టి పరిస్థితులవల్ల బ్లాకు ప్రాంతంలో అధికోత్పత్తి కుంటుపడింది. ఏవో కొన్ని సందర్భాలలో తప్ప కమతాల స్థిరీకరణ వంటి శాశ్వత అభివృద్ధి కార్యక్రమాలు జరుగలేదు.

కొరసవాడు గ్రామంలోనూ, పరిసర గ్రామాల్లోనూ కలరావ్యాధి సోకింది. పశువులలో బ్లాక్ క్వార్టర్ వ్యాధి తీవ్రంగా వ్యాపించింది. దీనిని అరికట్టటానికి అవసరమైన చర్యలు గైకొనబడినవి.



సాధారణ వ్యాధులకు :

# దేశీయ వైద్యం

"ఆరోగ్య పోషణ, కొన్ని సామాన్య వ్యాధుల చికిత్స, నిరోధాలకై ఆంధ్రప్రదేశ్ ప్రజలు వాడే దేశవాళీ వస్తువులు, నాటువైద్య పరిశీలన" అనే పరిశోధన పథకం ఒకటి హైదరాబాదు ఉస్మానియా వైద్యకళాశాల వైద్యచరిత్ర ఆచార్యుడు డాక్టర్ డి. వి. సుబ్బారెడ్డిచే నడపబడుతున్నది.

ప్రస్తుతపు ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలోను, దాని సరిహద్దు ప్రదేశాలలోను యించుమించు 2000 సంవత్సరాల క్రిందటకూడా ధాన్యకటకం (అమరావతి), విజయపురి (నాగార్జున కొండప్రాంతం), వేంగివంటి కొన్ని నాగరిక, సంస్కృతీ కేంద్రాలు వున్నాయి. గడచిన 1000 సంవత్సరాలలోను ప్రజాసంక్షేమానికై కృషిచేసిన మహారాజ్యాలు వుదయించాయి. రాజమండ్రీ చాళుక్యులు, వరంగల్లు కాకతీయులు, కొండవీటి రెడ్డిలు, విజయనగర (హంపి) రాజ్యాలు బహమనీ సుల్తానులు, గోల్కొండ నవాబులు. ఈకాలంలో రాజులకి, రాజోద్యోగులకి, ఆఖరికి నగరవాసులకికూడా జబ్బుచేస్తే యేదోరకం చికిత్స జరిగేది. అంటువ్యాధులు, కరువుజబ్బులు, బాలెంత, శిశుమరణాలు యిప్పుడు ఆధునిక వైద్యశాస్త్రం ప్రసాదించిన నూతన విజ్ఞానంతో, అభివృద్ధి చెందిన రాకపోకల సౌకర్యాలతో అదుపులో పెట్టబడుతున్నాయి. ఇవి కాక అనేకరకాల అనారోగ్యాలు, నలతలు, వ్యాధులు ఆయా ప్రాంతాలలోని అమెచ్యూర్ మెడికల్ ప్రాక్టీషనరులచే వివిధ పద్ధతులు, ఓషధులు మున్నగువాటిద్వారా కుదర్చబడుతున్నాయి.

పండితులు చరకసూత్రాలు మున్నగు ప్రాచీన సంస్కృత వైద్య గ్రంథాలను చదివి ఆపద్ధతులను అవలంబించినా వైద్యవృత్తిలోనున్నవారు కొందరు ఆమోదింపబడి ప్రమాణీకృతం చేయబడిన చికిత్సలు వ్యాధులను యెలా యెంతవరకూ కుదురుస్తున్నవో పరిశీలించి, వివిధ పరిస్థితుల చికిత్సలో యితరులు యేమివాడుతున్నారో కూడా పరిశీలించి, వాటిని తాము ప్రయత్నించి ఫలితాలను వ్రాసిన్రంచారు. పాండిత్యం, వైద్యం వంశపారంపర్యా వచ్చే కుటుంబాలు దేశం ప్రతి ప్రాంతంలోను వున్నాయి. కొందరు రాజవైద్యులు, మరికొందరు గ్రామ వైద్యులు. వారు రాజబహుమానాలు, భూదానాలు, స్థానిక ధర్మాదాయాలతో జీవయాత్ర చేసేవారు. వారు తాము యిచ్చిన మందు వివరాలను, మందు తయారీ పద్ధతులను తాటియాకు పుస్తకాలపై వ్రాసుకొని భద్రపరచుకొని తమ పిల్లలకు యిచ్చి వాటిలో విషయాలను పుత్రపౌత్రులకు నేర్పేవారు. ఇట్టి సమాచారంగల పుస్తకాలు, నివేదికలు పత్రాలు చాలారకాలవి వున్నాయి. వీటిలో తెలుగు పుస్తకాలు కొన్ని ముద్రించి ప్రకటింపబడినవి. కాని యీ పథకంలో తలపెట్టిన విధంగా సమాచారాన్ని సేకరించే దృష్టితో యెవరూ వాటిని లోతుగా పరిశీలించలేదు. అసలు రిసైప్సు, నోట్సు, చికిత్సలుగల వ్రాతప్రతులు తెలుగులో చాలా వున్నాయి. ఇవన్నీ వివిధ ప్రభుత్వ గ్రంథాలయాలు, ప్రైవేటు సేకరణలలో చెదరివున్నాయి. వీటిని జాగ్రత్తగా వెతికి పరిశీలించాలి.

## ఓషధీ - విక్రేతలు

మరోరకం వైద్యులుకూడా వున్నారు. వీరు కొన్ని చికిత్సా విధానాలను తండ్రి లేక గురువుల వద్ద నేర్చుకొని పట్టణాలు లేక గ్రామాలలో సామాన్యులికి చికిత్సచేసేవారు. అజ్ఞానులైనా వీరి వృత్తి వంశానుక్రమమైనది. వారు యేమి వ్రాయకుండా

చికిత్సా విధానాన్ని నోటితోచెప్పి మందులు యిచ్చే వారు. మరో తరగతివారు అడవులలో ఓషధులను సేకరించి వాటిని లేక పొడుములను, యితర వస్తువుల్ని వూరూరూ తిరిగి అమ్మేవారు. గడచిన 100 సంవత్సరాలుగా ఆంధ్రప్రాంతంలో యీ సమాచారం, విజ్ఞానం క్రమేణా క్షీణిస్తున్నది. ఆ తరువాత ఏజన్సీ ప్రాంతాలు, పల్లెప్రాంతాలలో కొండజాతులు, వెనుకబడిన జాతులు ఓషధులను సేకరించి లోపలికి మందు యివ్వకుండా వాటిని మెళ్లో కట్టడం మున్నగు పై చికిత్సలద్వారా జబ్బును నయంచేసే వారు. రాకపోకల ఆధునిక సౌకర్యాలు, ఆధునిక వైద్యం విస్తరణతో వీరు తమ వృత్తిని మానుకుంటున్నారు లేదా యీ విజ్ఞానాన్ని, అట్టి మందులను భద్రపరచుట అశ్రద్ధ చేస్తున్నారు. ఇంకా పరిశీలించుటకై ఈ ప్రాంతాలకు వెళ్లి సమాచారాన్ని సేకరించేవారెవరూ లేరు.

ఈ విజ్ఞానాన్ని, పద్ధతులను, సంప్రదాయాలను తెలుసుకుని వాటిని ఒక పద్ధతిలో యేర్పాటుచేసి పరిశీలించుట యీ పథకం ఆశయమైవున్నది. ఆ తరువాత ఇవి విస్తృతంగా వుపయోగింపబడేవో లేక పరిమిత ప్రాంతాలలో వుపయోగింపబడేవో, స్థానిక ఆయుర్వేద రచయితలు, పుస్తకాలచే అవి ఆమోదింప బడినవేమో, యీ ఓషధులు లేక మందులను చూచి ఆనవాలు పట్టుటకు, యీ ప్రాంతంలో అదే ప్రయోజనాలకి వాడబడిన ఆయుర్వేద, యునాని. అలోపతి వస్తువులతో పోల్చుటకు వీలుపడుతుందేమో అనే విషయాలను తెలుసుకొనుటకు ప్రయత్నం జరుగవచ్చు.

ఓషధులు, వాటి ఉపయోగాలు లేక వ్యాధులు, చికిత్సలకు సంబంధించిన సమాచారం సాధ్యమై నమ్మదగిన అన్నిచోట్లనుంచి సేకరించబడి భారతీయ వైద్య పరిశోధన సంఘానికి, ఫార్మొకాలజీ కమిటీకి, క్లినికల్ రీసెర్చి కమిటీకి అందజేసినట్లయితే ఆ తరువాత కేంద్ర ప్రభుత్వం ఆరోగ్య మంత్రిత్వశాఖ వాటిలో వుత్తమమైన కొన్ని ఓషధులను, మందులను, కొన్ని విధానాలు, చికిత్సలకొరకు యేరగలగవచ్చు. వాటిని యింకా పరిశీలించవచ్చు. సంప్రదాయాలు, పై చికిత్స మున్నగునవి చింతామణి వంటివని కొందరంటే అవి మంచివి కాదని, ఆధునిక శాస్త్ర పద్ధతులలో వాటిని వివిధ రకాల జంతువులు, ఆరోగ్య, అనారోగ్యవంతులైన మనుషులపై సరైన పరిస్థితులు, నిపుణుల అజమాయిషీల క్రింద ప్రయత్నించి చూడాలని మరికొందరు అంటున్నారు. మంచి మందులు ఆఖరికి ఒకటి లేక రెండు మంచివని ఋజువుచేసినా లేక యిప్పటికింకా త్వరగా నమ్మకంగా కుదరని ఒకటి రెండు వ్యాధులు నిరోధింపబడి కుదిరినా భారతీయ వైద్య పరిశోధన సంఘం విదేశ ద్రవ్యాన్ని కాపాడుకొనుటకు లేక ప్రజల ఆరోగ్యాన్ని, పనిశక్తిని రక్షించుటకు మార్గదర్శి కాగలదు.

ఈ సంవత్సరం (1958-59) యీ పని దిగువ పద్ధతులలో జరుపబడుతున్నది. 1. దేశీయ పద్ధతులలో వైద్యం చేసేవారు, స్థానిక మందుల వుపయోగంలో తగినంత విజ్ఞానం, అనుభవంగల వ్యక్తులు, సంస్థల సందర్శన. 2. దేశీయ మందులకి సంబంధించిన పుస్తకాలు, నివేదికలు, వారపత్రికలు వగైరాల జాబితాల సేకరణ. 3. అందుబాటులో వున్న పుస్తకాల నుంచి సమాచారం సేకరణ. 4. పరిశోధనకు వుపయోగించే రకాల యితర పుస్తకాలు, నివేదికల విషయంలో సమాచార సేకరణకై ఆంధ్రప్రదేశ్‌లో వివిధ వ్యక్తులు, సంస్థలతో వుత్తర ప్రత్యుత్తరాలు నడుపబడుతున్నాయి.

1959-60 సంవత్సరంలో జరిగేపని కార్యక్రమం యిది :—

I. ఆంధ్రప్రదేశ్‌లో దేశీయ వైద్య విధానాలకి సంబంధించిన వ్రాతప్రతులు, నివేదికల జాబితాల సేకరణ, తయారీ. II. ఎ. మందులషాపులు వగైరాలలో దర్యాప్తు బి. ఓషధులు పెరిగే ప్రదేశాల సందర్శన. III. ఆంధ్రప్రదేశ్‌లో దేశీయ వైద్యులు, మామూలు ప్రజలు వ్యాధినివారణకై వుపయో

గించే మందుచెట్లు, మామూలు మందులు, వృక్ష, ఖనిజ పధార్థాల జాబితాల సేకరణ IV. మరికొంత సమాచారం సేకరించుటకు ఆంధ్రప్రదేశ్ వేర్వేరు కేంద్రాల సందర్శన, అక్కడ మకాం. ఏ. కొన్ని గ్రంధాలయాలలో మాత్రమే వుండే అపురూపమైన ప్రాచీన గ్రంథాలపఠనం, మందులకు సంబంధించిన భాగాలను వ్రాసుకొనుట. బి. ప్రత్యేక సేకరితాలలో దేశీయ మందులపై నివేదికల పరిశీలన. సి. ఏజన్సీ ప్రాంతాలు, సమాజాభివృద్ధి ప్రాజెక్టులు, అభివృద్ధి కేంద్రాల సందర్శన. V. వివిధ ప్రదేశాల నుంచి మందుచెట్లు, వాటి వుపయోగాలు, జబ్బులు, వాటి చికిత్సలగురించి సమాచారం సేకరణ.

ఈ విషయంలో అవసరమైన సహాయం చేయమని యీ పరిశోధన పధకాన్ని నిర్వహిస్తున్న అధికారి ఆంధ్రప్రదేశ్ ప్రజానీకాన్ని కోరుతున్నారు.



# అభిప్రాయ వేదిక

## హైదరాబాద్ గుణపాఠాలు

"హైదరాబాద్ గుణపాఠాలు" అనే శీర్షికతో "హిందూస్థాన్ టైమ్స్" పత్రికలో శ్రీ వైకుంఠ లాల్ మెహతా యిలా వ్రాశారు :

గడచిన నెలలో భారత ప్రధాని సమక్షంలో హైదరాబాద్‌లో జరిగిన అంబర్ చరఖా ప్రదర్శనము గురించి చాలా గొప్పగా వార్తలు వర్ణనలు వెలువడినాయంటే అందులో అతిశయోక్తి లేదు. ఆ ప్రదర్శనను చూచే అవకాశం లభించిన వారందరూ, అది ఆశ్చర్యకరంగా వుందనీ, యితరులలో ఉత్సాహం పురికొల్పగలిగిందనీ పేర్కొన్నారు. చరఖా యొక్క శక్తి సామర్థ్యాలను ప్రత్యక్షంగా ప్రదర్శించినందుకు, మన ఆర్థిక వ్యవస్థలో చేతితో నూలుతీసే పద్ధతికి ప్రాధాన్యం కలదని విశ్వసించే వారందరూ హైదరాబాద్ సమితికి కృతజ్ఞతలు తెల్పుకుంటారు.

## అపూర్వ ప్రదర్శనం

అయితే యీ గొప్పతనం దేనిలోవుంది. ఒక్కచోట అంతమంది నూలువడికే వారు సమావేశము కావటం మొట్టమొదటి విశేషం. లోగడ ఎప్పుడూ కూడా ఒకేచోట సమిష్టి ప్రదర్శన కొరకు 1500 మంది సమావేశం కాలేదు అంబర్ చరఖామీద నూలు తీయబడినందున, మామూలు చరఖా ప్రదర్శనాల కంటే యిప్పుడు చాలా విశాలమైన ప్రదేశం కావలసి వచ్చింది. రెండవవిశేషం ఏమంటే, వడికిన, వారందరూ స్త్రీలు కావడమే కాకుండా, మామూలుగా బహిరంగ సభలకు రాని తరగతులకు చెందిన స్త్రీలు యిందులో పాల్గొన్నారు. వీరిలో 80 శాతం పైగా ముస్లిములు అంటే. సామాన్యంగా బైటికి రానివారూ, వచ్చినా పరదాలో వచ్చేజాతికి చెందిన వారు. ఇటువంటి వారు తరతరాలుగా వచ్చే తమ పరదా ఆచారాన్ని తృణీకరించి, యీ విధంగా వచ్చి ప్రదర్శనలో పాల్గొనటం నిజంగా ఒక గొప్ప విశేషమే. ముస్లిం జనాభాలో స్వామి రామానంద తీర్థ, యింకా ఆయన సహచరులు రేకెత్తించిన ఉత్సాహానికి యీ ప్రదర్శనమే నిదర్శనము. మరొక విశేషం. ప్రదర్శనలో పాల్గొన్న వారందరూ ఖద్దరు ధరించారు.

ఏదో ఒక ప్రత్యేక ఉత్సవ సందర్భంగానే యీ యేర్పాటు జరిగినా వారందరూ కేవలం నెహ్రూకు జోహార్లు అర్పించటానికే వచ్చి ప్రదర్శనలో పాల్గొన లేదు. నూలు వడకటం దాదాపు వారి జీవయాత్రలో ఒక ప్రధాన భాగం అయింది. ఆ సందర్భంలో వారు వాడిన చర్ఖాలు వారి సొంతానివే. సమితి అందించిన సమాచారమును బట్టి, హైదరాబాద్‌లో నూలువడికే వారి సంపాదన సగటున రోజుకు రూపాయి పావలా వరకు వుంటుంది. దీని వల్ల చరఖా ఉద్యమం బాగానే సాగుతున్నదనీ, రోజంతా వడకడం జరుగుతుంధనీ గ్రహించవచ్చు. ఇది వడికే వారికీ, వారికి శిక్షణ యిచ్చి తయారు చేసిన వారికీ కూడా ప్రతిష్ఠాకరమైన విషయం. అంబర్ చరఖా వుద్యమం విజయ వంతం కావాలంటే, ఏ సాంఘిక చైతన్యం హైదరాబాద్ అభివృద్ధికి దోహదకారి అయిందో, ఆ సాంఘిక చైతన్యంతో యీ కార్యక్రమం కొనసాగించాలి.

హైదరాబాద్ నగరము క్రమ క్రమంగా పెరుగు తున్నది. యిక్కడి ముస్లిం జనాభాలో నిరుద్యోగం ఎక్కువగా వుంది. ఈ విషయము లను గమనించటం అవసరం. యిదే విధంగా త్వరగా పెరుగుతున్న నగరాలు యింకా వున్నవి. ప్రతి సంవత్సరం వేలాది ప్రజలు గ్రామసీమలనుండి ఉద్యో

గావకాశాల కోసం నగరాలకు ఆకర్షితులవుతున్నారు. ఈ నిరుద్యోగ సమస్య హైదరాబాద్ లోని ముస్లిం జనాభాకు మాత్రమే పరిమితమైలేదు. హైదరాబాదులో పరదానువదిలేసి బయటికివచ్చియీ ఉద్యమంలో పాల్గొన్న స్త్రీలను అభినందించ వలసిందే. కాని యితర ప్రాంతాల్లో కూడా నూలు వడకం వంటి వృత్తులను అవలంబించి, తద్వారా కుటుంబ పోషణకు తాము కూడా కొంత ఆర్జించ వలెననే ఉత్సాహంగల స్త్రీలుఅనేకమంది వున్నారు.

## హైదరాబాద్‌తో పోటీ పడండి!

హైదరాబాద్ ఖాదీ సమితి శిక్షణ యిచ్చుట లోనూ, నూలు ఉత్పత్తిలోనూ అవలంబించిన విధానము ప్రశంసా పాత్రమైనది. అంబర్ చరఖా మూలంగా దేశంలోని సాంఘిక దుస్థితి కొంతవరకు తొలగాలంటే ఆ విధానాలను భారతదేశం అంతటా అవలంబించాలి.

ఉత్పత్తిలో వికేంద్రీకరణ విధానాలను గురించి ఆలోచించు నప్పుడు, మనం సాధారణంగా యీ సూత్రమును ఆచరణలో పెట్టే విషయమే ఆలోచిస్తాము. హైదరాబాద్ ప్రదర్శన ఏమని ఋజువు చేస్తున్న దంటే, - ఒక ఉత్పత్తి సాధనంగా అంబర్ చరఖాకు పట్టణ ప్రాంతాల ఆర్థిక వ్యవస్థలో కూడా సముచిత స్థానమే వున్నది. అయితే ఆర్థికంగా అట్టి అవసరం వున్న పక్షంలోనూ, యీ పనిని సక్రమమైన పద్ధతుల్లో నిర్వహించే పక్షంలోనూ యిది సత్ఫలితాలకు దారి తీస్తుంది. పట్టణ ప్రాంతాల నిరుద్యోగ సమస్యను చర్చించ బూనుకుంటే సాధారణంగా విద్యావంతులను గురించి మనం ఆలోచిస్తాము. కాని ఎంప్లాయిమెంట్ ఎక్షేంజిలో పేర్లు కూడా నమోదు కాని అనేకమంది యితరులను గురించి పట్టించుకోము. కొంత సంపాదించుకుంటూ కూడా యింకా యితరులపై ఆధారపడే వారు అధిక సంఖ్యలోనే వున్నారు. వారు ఎప్పుడూ చాలీ చాలని సంపాదనతో సతమత మవుతుంటారు. పోతే సంపాదన ఏమీ లేకుండా యితరులపై ఆధారపడిన వారి సంఖ్య మరీ ఎక్కువ. వీరిశక్తి సామర్థ్యాలను సక్రమంగా వినియోగించుకుంటే జాతి సంపద అభివృద్ధి చేయటానికి అవకాశం వుంటుంది. హైదరాబాద్ ప్రదర్శన నుండి నేర్చుకోవలసిన గుణపాఠం యిదే.

## సాంఘిక మార్పు

చివరి విషయం సొంత వినియోగానికి ఉత్పత్తి చేసుకున్న ఖద్దరుకూ, అమ్మకానికి తయారైన ఖద్దరుకూ మధ్య భేదం కల్పిస్తూ తరచు ఆలోచనలు జరుగు తుంటాయి. స్వయం పోషకత్వ లక్ష్యసాధనకు ఖాదీని అభివృద్ధి చేయాలని సకారణంగా వాదించి చెప్పవచ్చు. అయితే యీ స్వయం పోషకత్వ సూత్రం, ఒక వ్యక్తికీ, ఒక కుటుంబానికీ, గ్రామానికీ, లేక ఒక ప్రాంతానికీ వర్తింప జేసుకోవచ్చు. యీ విధమైన అభివృద్ధి పెట్టబడి వ్యాపారపు పరిధిలోకి రాదు. హైదరాబాద్‌లో జరిగిన కృషి వేరే తరగతికి చెందినట్టిది. అక్కడ వడకటం నేర్చుకున్న స్త్రీలు, తమ నిత్య జీవితంలో అవసరాలను తీర్చుకొని స్వయం పోషకత్వాన్ని సాధిద్దామనే ఉద్దేశంతో వచ్చినవారు కాదు. లోగడ సూచించినట్టుగా, ఏదైనా ఒక మంచి ఉత్పత్తి కార్యక్రమంలో నిమగ్న మవుదామని ఆశించినవారు. యిప్పుడు వారు సొంత ఉత్పత్తి సాధనాలను కలిగి తమకు తామే ఉద్యోగాలు కల్పించుకొన్న తరగతికి చెందిన వారు. యిటువంటి వారిని అధిక సంఖ్యలో రంగం లోనికి రప్పించగలిగితే అది చాలా గొప్ప సాంఘిక సేవగా చెప్పుకోవచ్చు. ఈ రంగం అభివృద్ధి చెందిన కొలది మనం లక్ష్యమైన సోషలిస్టు తరహా సమాజ స్థాపనకు చేరువగా వెళ్ళుతున్నామని అనుకోవచ్చు కూడా. ఈ విధంగా ఆలోచిస్తే ఖాదీ కేవలం సాంఘిక సంక్షేమ కార్యక్రమమేకాదు; సాంఘిక పద్ధతుల మార్పు సాధించటంలో అది ఒక విశిష్టమైన ప్రత్యేక కార్యక్రమంగా పరిగణించవచ్చు.

-:0:-

# మానవ హక్కులు

**మిత్రరాజ్యాలచే మానవ హక్కుల డిక్లరేషన్ అవలంబించబడి 10-12-58 నాటికి పది సంవత్సరాలు అయింది. ఈ పదవ వార్షికోత్సవం సందర్భంగా ఆరోజున వుత్సవం జరుపబడింది, దాని ప్రాముఖ్యం వగైరా విషయాలు దిగువ వ్యాసాలలో వివరించ బడినవి :**

## ( శ్రీ గోపాలరావు ఎక్బోటే )

10-12-'48 న ఆమోదింపబడిన మానవ హక్కుల ప్రకటన ఆశయాల సాధనలో కొంత ఆలస్యం ఆశా భంగం కలిగినా మిత్రరాజ్యసమితి స్థిరమైన అభివృద్ధిని సాధించింది. భవిష్యత్తులోకూడా యీ రంగంలో సర్వతోముఖమైన సత్వరాభివృద్ధిని అది ఆశించవచ్చు.

మానవ హక్కుల ఆలోచనా చరిత్ర పరిణామం మనలను 17 వ శతాబ్ది లేక యింకా అంతకుముందు కాలానికి తీసుకువెడుతుంది. టామీపైనే మానవ హక్కులు, జఫర్‌సన్ చేసిన హక్కుల ప్రకటన, రూసో, ఫ్రెంచి విప్లవాల దగ్గరనుంచి మానవ హక్కులపై హెచ్. జి. వెల్సు, మిత్రరాజ్య సమితి చర్చలవరకూ విభిన్నమైన అభిప్రాయాలు వున్నాయి. ఇవన్నీకూడా ఒక్క విషయాన్ని ఋజువుచేస్తాయి. అదియిది : మనిషికి సహజమైన లేక ఆ జన్మసిద్ధమైన హక్కులు కొన్ని వున్నాయి ; వాటిని గుర్తించి, స్వేచ్ఛగా వుపయోగించుకొనుటకు వీలు కలిగించుట ప్రభుత్వ కర్తవ్యం; మానవ స్వాతంత్ర్య పరిరక్షణకు, మానవ వ్యక్తిత్వ వికాసానికి అది అవసరం. మొదటి ప్రపంచయుద్ధం తెచ్చిపెట్టిన ఫలితాలవల్ల పెక్కు రాజ్యాంగాలు అవతరించినవి. వాటిలో మానవుని మూలహక్కులు గుర్తింపబడి, రాజ్యాంగంలో ఒక భాగం చేయబడినవి. రెండవ ప్రపంచయుద్ధం తరువాత, మిత్రరాజ్య సమితి మానవ హక్కుల చార్టర్‌పై చర్చల ఫలితంగా, ఆ యుద్ధం పిమ్మట తయారైన రాజ్యాంగాలు యెక్కువవాటిలో మూల హక్కులు అంతకుముందుకంటె కూడా స్పష్టతరంగా కనిపించాయి.

ఈ విధంగా యిప్పుడు వ్రాతమూలకమైన ఆధునిక రాజ్యాంగాలు పెక్కిటిలో మానవ మూల హక్కులను గురించి లాంఛనంగా ప్రకటించుట పరిపాటయినది. ఉదాహరణలుగా అమెరికా, స్విట్జర్లాండు, జర్మనీ, రష్యా, ఐర్లండుల రాజ్యాంగాలను పేర్కొనవచ్చు. వ్రాతమూలకమైన రాజ్యాంగం లేని ఇంగ్లండులో కూడా మాగ్నాకార్టా, హక్కుల పెటిషను, హక్కుల బిల్లులు స్వాతంత్ర్య పత్రాలుగా ప్రాణప్రదంగా చూచుకొనబడతాయి.

స్థూలంగా చెప్పాలంటే, యీ రాజ్యాంగాలలో ప్రకటింపబడిన హక్కులు మానవ హక్కుల విశ్వజనీన ప్రకటన సూత్రాలలో పెక్కిటికి సంబంధించినవి.

మిత్రరాజ్యసమితి చార్టరులో నిర్వచించబడిన ప్రయోజనాలలో మానవ హక్కులు, మూల స్వాతంత్ర్యాలపట్ల గౌరవాన్ని పెంపొందించుటలో అంతర్జాతీయ సహకారాన్ని సాధించుట ఒకటి. మానవ హక్కుల విశ్వజనీన ప్రకటనలో పౌర, వ్యక్తిగత, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో మానవుని జన్మహక్కులు లిఖించబడినవి.

దిగువ హామీలు మానవ హక్కుల ప్రకటనలో ఒక భాగమై వున్నాయి. జీవితం, స్వాతంత్ర్యం, వ్యక్తి భద్రతహక్కు, నిరంకుశమైన అరెస్టునుంచి రక్షణ, న్యాయమైన విచారణ, ప్రైవసీ, కదలిక, నివాస స్వాతంత్ర్యాలు, సాంఘిక భద్రత, పని, విద్యార్జన, పౌరసత్వం, ప్రార్థన, భావప్రకటన,

శాంతియుత సమావేశాల స్వాతంత్ర్యం, స్వదేశ ప్రభుత్వంలో పాల్గొనే హక్కు, ప్రభుత్వోద్యోగం చేసే హక్కు, ఆశ్రయాన్ని అర్థించుటకు, పొందుటకు హక్కు; ఆస్తిని కలిగివుండే హక్కు.

అసెంబ్లీ యీ హక్కులను "అందరు ప్రజలకు, అన్ని దేశాలకు సామాన్య ప్రమాణ సాధన"గా ప్రకటించి, వీటినిగురించి ప్రపంచ ప్రజలందరికీ తెలియ పరుచుటలో తోడ్పడమని సభ్యదేశాలను, సెక్రెటరీ-జనరల్‌ని, వివిధ ప్రత్యేక సంస్థలను కోరింది.

మానవ మూలహక్కుల సాధారణ గుర్తింపు ననుసరించి, భారతదేశంలో కూడా మనము మన రాజ్యాంగంలో మూలహక్కుల అధ్యాయాన్ని చేర్చాము. ఎందువల్లనంటే స్వేచ్ఛాయుతమైన సంఘంలో మానవ మూల హక్కులు కొన్నిటిని ప్రభుత్వ జోక్యం నుంచి పరిరక్షించుట అవసరం. కాబట్టి రాజ్యాంగం హామీయిచ్చే యీ మూల హక్కుల రక్షణకై సుప్రీంకోర్టుకి, రాష్ట్రాల హైకోర్టులకి చాలా విస్తృతమైన అధికారాలు యివ్వబడ్డాయి.

మానవ హక్కులన్నిటికి సమానమైన ప్రాముఖ్య మేవున్నా స్వేచ్ఛాయుతమైన సాంఘిక వ్యవస్థపై వాటిలో కొన్నిటికి యెక్కువ ప్రభావం వుంటుంది. కాబట్టి వాటిని యెప్పుడూ దృష్టిలో వుంచుకోవాలి. స్వాతంత్ర్యం విషయంలో హామీపొందిన ప్రతివ్యక్తికి సంఘంపట్ల కొన్ని విధులుకూడా వుంటాయి. మనం ప్రజాస్వామ్య ప్రభుత్వానికీ, సాంఘిక సమానతకీ కట్టుబడివున్నాం. ఆధునిక దేశాలలో యెక్కడైనా వ్యక్తిస్వాతంత్ర్యం నిర్దిష్టమైన రాజ్యాంగ పద్ధతి లేక యేర్పాటు ఫలితం కాదు—అయితే అట్టి పద్ధతి లేక యేర్పాటువల్ల స్వాతంత్ర్యానికి యెక్కువ భద్రత వుండేమాట నిజం. స్వాతంత్ర్యం మొత్తం సాంఘిక క్రమం మున్నగువాటిపై ఆధారపడి వుంటుంది. గొర్రెపిల్లకి జీవించే హక్కున్నదని గుర్తిస్తేనూ, తోడేళ్ల చర్యలకి విరుద్ధమైన నిబంధనలను లిఖిస్తేనూచాలదు. తోడేళ్లు, గొర్రెపిల్లల స్వాతంత్ర్యం సంఘం యిచ్చే విలువలపై ఆధారపడి వుంటుంది. వాటికి యెంతవరకూ హక్కుంది? ఎంతదూరం వాటిని ఒదలవచ్చును? అన్న విషయాలను నిర్ణయించాలి. రెండిటిలో యేటినీకూడా ముఖ్యంగా తోడేళ్లను అవి వెళ్ళగలిగినంత దూరం వెళ్ళనివ్వకూడదు. అక్కడ సంఘం జోక్యంచేసుకుని వాటివాటి శక్తి సామర్థ్యాలను గుర్తించి వాటివాటికి తగిన కార్య రంగాలను, జీవన పద్ధతిని నిర్ణయించాలి. ఆ జోక్యం విస్పష్టమైన నిర్ణయరూపం ధరించి ఆ సమస్యను శాశ్వతంగా పరిష్కరించవచ్చు. అది సాధారణంగా సంఘంలో సందర్భానుసారంగా అనుకూల శక్తులు, ప్రతికూల శక్తులు మున్నగు శక్తులు పని చేయుట వల్ల కలిగే ఫలితంగా వుంటుంది. ఇలా వివిధ శక్తులు కలసి పని చేయుటవల్ల జరిగే మార్పులు క్లిష్టమైన వలలా అల్లుకుంటవి. ఆధునిక ప్రపంచంలో స్వాతంత్ర్యం మిశ్రితము, జంగమము అయినచోటనే వుంటుంది.

నేటి సంఘం యుద్ధాలతో అలసి, శిథిలమై వున్నది. కాబట్టి గొప్పవయిన యీ మూల హక్కుల రక్షణకి యిప్పుడు మరీ ప్రాముఖ్యమున్నది. ఒకవంక పరస్పర విరుద్ధమైన రెండు ఆదర్శాల మధ్య నలుగుతూ మరొకవంక విధ్వంసకారకమగు అణ్వస్త్రాలు వుపయోగింపబడతవేమోనని యెప్పటికప్పుడు భయ పడుతూ మానవజాతి ఒకమూల నిలబడింది; అక్కడ దాని మనుగడే ప్రమాదంలో వుంది. ఈ పరిస్థితి దారుణమైనదే; కాబట్టే స్వాతంత్ర్యానికి, ప్రజా స్వామ్యానికి జీవితాలను పునరంకితం చేయమని అది ప్రజాస్వామ్యంలో విశ్వాసం కలవారందరినీ ప్రబోధిస్తుంది.

ప్రజాస్వామ్యం లేక స్వయం పరిపాలన కొన్ని మూలసూత్రాలపై ఆధారపడివుంది. అందులో కొన్ని దేశ వ్యవస్థ స్వభావాన్ని బట్టి వుదయిస్తాయి, మరి కొన్ని యిప్పుడు పెక్కు రాజ్యాంగాలలో గుర్తింపబడిన మూలమానవ హక్కుల నుంచి వుత్పన్నమవుతాయి.

వ్యక్తి సమానత, అతనికిగల పెక్కు హక్కుల రక్షణ న్యాయాన్ని సమకూర్చుటకు, స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుటకు ప్రాతిపదిక కాగలవు. ఈ ఆశయాల సాధనకై న్యాయ శాస్త్రానికి తిరుగులేని అధికారం

కూడా వుండాలి. సంపద, అధికారం, పరిస్థితులు యెలావున్నా ఒక వ్యక్తిగాని వర్గంకాని దానిని వుల్లంఘించకూడదు. యే కారణంచేతకాని యెవరికీ దాని రక్షణ నిరాకరింపబడకూడదు.

ముఖ్యమైన వ్యక్తి స్వాతంత్ర్యాలకు భంగం రాకుండా వీటిని మరికొన్ని మూలసూత్రాలను సమర్థమైన స్వయం పరిపాలనా పద్ధతిలో యిముడ్చుటకు కొన్ని సూత్రాలను నెలకొల్పుట అవసరం అయింది. ఈ సందర్భంలో వయోజన ఓటుపై ఆధారపడిన ప్రాతినిధ్య ప్రభుత్వం సమర్థమయిన ప్రజాస్వామ్య ప్రభుత్వంగా కనుగొనబడింది.

అయితే అసలైన ప్రజాస్వామ్యం అసంపూర్ణమైన రకంగామారకుండా జాగ్రత్త పడాలి. ప్రజాస్వామ్యంలో ప్రజాభీష్టం ప్రభుత్వ స్వేచ్ఛకి హద్దుల నేర్పరచినట్లే ప్రజాభీష్టం స్వేచ్ఛకికూడాహద్దులు వుండాలి. అలా హద్దులేని ప్రజాభీష్టం అధిక సంఖ్యాకుల నిరంకుశత్వంగా తయారయి రాజకీయ పోటీ స్వేచ్ఛను పాడుచేసి క్రొత్త అధిక సంఖ్యాకవర్గం అధికారంలోకి రాకుండాచేస్తుంది. పోటీ స్వేచ్ఛను రూపుమాపుటకు అనగా అసంపూర్ణ ప్రజాస్వామ్యానికీ, పోటీని రూపుమాపుటకు అనగా టోటాలిటేరియానిజం మధ్య ఆట్టేభేదంలేదు.

పాలకుల అధికారాన్ని పరిమితం చేయాలంటే అధిక సంఖ్యాకుల అభీష్టబలాన్ని ప్రభుత్వ సిబ్బంది, విధానాలపై ప్రసరింపచేసే స్వేచ్ఛ ప్రజాస్వామిక శక్తులకి వుండాలి. ప్రభుత్వానికిగల పరిపాలనా స్వాతంత్ర్యము, పాలకులను మార్చుట, పాలకుల అధికారానికి హద్దు లేర్పరుచుట ఒకే నాణెము యొక్క రెండు పక్కలవంటివి. పాలితులకి స్వేచ్ఛ యివ్వని ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యమే కాదు. ఎందునల్లనంటె అక్కడ ప్రజలకు పాలకులను, వారి ద్వారా విధానాలను యెన్నుకునే స్వేచ్ఛ వుండదు. ఆ స్వేచ్ఛలేని ప్రజాస్వామ్యంలో ప్రభుత్వ సిబ్బంది, విధానాలకు అప్పుడప్పుడు మాత్రమే ఆమోదం లభిస్తూ వుంటుంది. ఇది టోటాలిటేరియన్ రకం ప్రజాస్వామ్యం. ఇక్కడే సంప్రదాయసిద్ధమైన నిరంకుశత్వానికి, ఆధునిక, టోటాలిటేరియానిజంకి విస్పష్టమైన తేడా కనబడుతుంది. నిరంకుశత్వం నిర్లక్ష్యంతో లేక విరోధభావంతో వున్న ప్రజలపై తన అధికారాన్ని చెలాయిస్తుంది, టోటాలిటేరియానిజం ప్రజల అంగీకారంతో పరిపాలించాలని ఆశిస్తుంది. దాని ఆశఫలించవచ్చుకూడా. అయితే అసలైన ప్రజాస్వామ్యంలో మాత్రం రెండు ప్రతిపక్షాల చర్యలవల్ల కలిగే తాత్కాలిక ఫలితమే ప్రజల సమ్మతి. ఈ ప్రతి పక్షాలు రెండూ ప్రజల సమ్మతిని పొందుటకై స్వేచ్ఛగా, న్యాయంగా పోటీలో పాల్గొంటాయి.

మానవ హక్కుల ప్రకటన స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాల సూత్రాన్ని నెలకొల్పింది. మానవ స్వాతంత్ర్యానికి అవసరమైన యీ సూత్రాన్ని సమర్థించుటకే మిత్రరాజ్యాల ప్రజలు శాంతి ప్రియులుగా పోరాటానికి వచ్చారు. తద్వారా తమ పిల్లలు శాంతిగా జీవించుటకు అవకాశం కలుగుతుందనీ, అంధకారబంధురమై క్రూరమైన భూతకాలపు దుష్టసిద్ధాంతం మాసిపోయి నూతన పరిస్థితులు యేర్పడుతాయని వారి ఆశ. మానవాళి యింకా యెంతత్యాగం చేయాలో యెన్ని బాధలు అనుభవించాలో చెప్పడం కష్టం. కాని మానవ స్వాతంత్ర్య సిద్ధాంతం చివరకు గెలుపునొందుట రేపు సూర్యోదయమెంత తథ్యమో అంత తథ్యం. మానవాళి మహోద్యమం ద్వారా గొప్ప స్వాతంత్ర్యంగల ప్రజల ప్రభుత్వమనే ఆలోచన రూపొందుతున్నది. ఆ ప్రభుత్వాలలో ప్రజలు తమపై తామే శాసనాలను విధించుకుని క్రమ పద్ధతిని పోషించగలరు. ప్రపంచమంతటా ప్రజాస్వామ్యం విజయధ్వజమెత్తే వరకూ ప్రబుద్ధ ప్రపంచం మదగజంలా అలా ముందుకు సాగుతూనే వుంటుంది.

-:0-0:-

# మానవ హక్కుల విశ్వజనీన ప్రకటన

(ఆచార్య ఎమ్. వెంకటరంగయ్య)

మిత్రరాజ్యాల సాధారణ సభ మానవ హక్కుల విశ్వజనీన ప్రకటనను 10-12-1948 న ఆమోదించింది. ఇది మానవజాతి చరిత్రలో చాల ముఖ్యమైన విషయం. అందువల్లనే ప్రపంచంలో పెక్కు దేశాలు ఆ రోజున వార్షికోత్సవం జరుపు కుంటు న్నాయి.

ఈ ప్రకటనలోని విశేషమేమిటంటే, దానిలో "హక్కుల"తో కలసి "విశ్వజనీన", "మానవ"అనే మాటలు చేరి వున్నాయి.

"హక్కులు"అనే మాట సాంకేతిక పదం. అది అనేక విధాల నిర్వచించ బడింది. ప్రస్తుత ప్రయోజనాలకై, సంఘంలో స్త్రీ పురుషులు కష్టనష్టాలు లేకుండా సుఖంగా సంతోషంగా జీవించుట కవసరమైన అన్ని పరిస్థితులు అని అర్థం చెప్పుకోవచ్చు. అట్టి పరిస్థితులన్నీ వుంటే అప్పుడే వ్యక్తులకు హక్కులు వున్నాయని మనం చెప్పవలసి వుంటుంది. పరిస్థితులన్నీ సమకూరితే అన్ని హక్కులూ వుంటాయి. కొన్ని పరిస్థితులే సమకూరితే కొన్ని హక్కులే వుంటాయి. ఇక్కడ గమనించ వలసిన దేమిటంటే హక్కులంటే ఆనందమయ మయిన చక్కని జీవితం గడుపుటకనువయిన పరిస్థితులుఅని.

అధికారంలో వున్నవారు వ్యక్తుల్ని నిరంకుశంగా జైలుకి పంపితే ఆనంద కరమైన జీవితం లభించదు. కాబట్టి వ్యక్తి స్వాతంత్ర్యం హక్కును హక్కు అంటాం. అలాగే ప్రభుత్వం నష్ట పరిహారం చెల్లించకుండా ఒకని ఆస్తిని స్వాధీనం చేసుకున్నా లేక మత విశ్వాసాన్ని ప్రకటింప నీయకున్నా కూడా అంతే. కాబట్టి ఆస్తిలేక ప్రార్థనా స్వాతంత్ర్యాలను మూల హక్కులు అంటాం. వ్యక్తులకు యే యే హక్కులను యివ్వాలో, వారు ఆనందంగా వుండాలంటే వారికి యే యే స్వాతంత్ర్యాలను యివ్వాలో చరిత్ర చెబుతున్నది.

విశ్వజనీన ప్రకటన "మానవ" హక్కుల్ని గురించి పేర్కొంటున్నది. ఇది చాలా ముఖ్య విషయం. ఎందువల్లనంటే, మనుషులందరికీ మనుషులుగానే హక్కులు యివ్వబడాలనీ, జాతి, వర్ణ, భాష, మత విభేదాలను బట్టి కాని రాజకీయ లేక యితర అభిప్రాయాలను బట్టి కాని వివక్షత చూపరాదనీ అనే అభిప్రాయం దానికి ప్రాతిపదిక అయి వున్నది. ప్రపంచంలో పెక్కు దేశాలలో ప్రభుత్వాలు ప్రజలలో కొన్ని వర్గాలకు మాత్రమే హక్కులను యిస్తాయి. ఉదాహరణకు దక్షిణాఫ్రికాలో హక్కులు తెల్లవారికే కానీ రంగు జాతులకు లేవు. పూర్వం పెక్కు క్రైస్తవ దేశాలలో క్రైస్తవులకే కాని క్రైస్త వేతరులకు హక్కులు యివ్వబడేవి కావు. విశ్వజనీన ప్రకటన అట్టి విచక్షణకు అవకాశ మివ్వదు. స్త్రీ పురుషు లందరికీ వారి "మానవత్వం" కారణంగా హక్కులు యివ్వబడాలని అది వుద్ఘాటిస్తుంది. మరో మాటలలో చెప్పాలంటే హక్కుల ప్రాతిపదిక "సమానత్వం".

ఈ విశ్వజనీన ప్రకటనలో మరో విశేష మేమిటంటే, హక్కులు "విశ్వజనీనం"గా వుండాలని పేర్కొన బడ్డం. ప్రపంచంలో అన్ని దేశాల ప్రజలకి అవి వుండాలని అర్థం. గతంలో కొన్ని దేశాల రాజ్యాంగాలు మాత్రమే మూల హక్కులకు హామీ యివ్వటంవల్ల విశ్వమానవు లందరికీ అవి యివ్వబడాలని నొక్కి చెప్పటం జరిగింది. అట్టి హామీనిచ్చిన దేశాలలో అమెరికా ముందు వస్తుంది. ఆతరువాత ఫ్రాన్సు, ఇంగ్లండు మున్నగు దేశాలు వస్తాయి. కాని నేడు అట్టి హక్కులు లేని దేశాలు చాలా వున్నాయి నిరంకుశ పాలన కల పెక్కు దేశా

లలో అవి లేవు. వలస ప్రాంతాలు, స్వయం పరిపాలన లేని యితర ప్రాంతాల ప్రజలకుకూడా అవి వుండవు. అన్ని దేశాల ప్రజలు మానవ హక్కులను సమానంగా అనుభవించాలని విశ్వజనీన ప్రకటన తెలియ చేస్తుంది.

1946 లో మిత్రరాజ్యాల వంటి ప్రపంచ సంస్థ యేర్పడినందున యిటువంటి విశ్వజనీన ప్రకటన వెలువడింది. ఆ సంస్థలో ప్రపంచంలోని పెక్కు దేశాలకు ప్రాతినిధ్యం వుంది. రాను రాను అన్ని దేశాలకి కూడా దానిలో ప్రాతినిధ్యం లభించడం తథ్యం. ఒక విధంగా అది ప్రపంచ దృక్పథాన్ని వ్యక్తం చేస్తుంది. ప్రపంచాత్మగా, ప్రపంచ శాంతి భద్రతల రక్షక సంస్థగా అది యేర్పడిన త్వరలోనే విశ్వజనీన ప్రకటన అవతరణకి చర్య గైకొన్నదంటే అందులో యేమీ ఆశ్చర్యం లేదు. మానవ హక్కులు, మూల స్వాతంత్ర్యాల దోహదం మిత్రరాజ్యాల ముఖ్య ప్రయోజనాలలో ఒకటని అదియేచార్టరు క్రింద యేర్పడినదో ఆ చార్టరు విస్పష్టంగా చెప్పినందున అది అలా చేసింది. మొత్తంమీద ఆ సంస్థ, దానిలో సభ్యులయిన దేశాలు విడివిడిగాను కూడా మానవ హక్కులు, మూల స్వాతంత్ర్యాలకు విశ్వజనీన గౌరవాన్నిచ్చి పాటించాలని, అది వాటి విధి అని కూడా ఆ చార్టరు పేర్కొన్నది. ఆ ప్రకారం 1946 లో మానవ హక్కులపై ఒక సంఘం యేర్పాటు చేయబడింది. ఈ సంఘం రెండు సంవత్సరాలు జరిపిన చర్చల ఫలితంగా విశ్వజనీన ప్రకటన వెలువడింది. ఆ ప్రకటనలో దాని సి ఫా ర్సు లు వున్నాయి. అది 10-12-1948 న సాధారణ సభ సమావేశంలో ఆమోదించ బడింది. దానికి అనుకూలంగా 48 రాజ్యాలు ఓటు చేశాయి. 8 రాజ్యాలు ఓటు చేయలేదు. ఓటుచేసిన దేశాలలో ఇండియా, ఇంగ్లండు, అమెరికా వున్నాయి. ఓటు చేయని దేశాలలో రష్యా, యితర కమ్యూనిస్టు దేశాలు, సౌదీ అరేబియా, దక్షిణాఫ్రికాలు వున్నాయి.

విశ్వజనీన ప్రకటన పీఠికా, 30 సూత్రాలూగల పత్రం. ప్రపంచంలో స్వాతంత్ర్యం, న్యాయం, శాంతిల రక్షణాభివృద్ధులకు, జీవిత ప్రమాణాల అభివృద్ధికి విశ్వజనీన మానవ హక్కుల గుర్తింపు అతి ముఖ్యమని పీఠికలో స్పష్టంగా, గట్టిగా పేర్కొన బడింది. 1,2 సూత్రాలు యీ ప్రకటనకి మూల కారణమైన తత్వం ముఖ్యాంశాలను వివరిస్తాయి: పుట్టుకలో మానవు లందరూ ఔన్నత్యంలో హక్కుల విషయంలో సమానులే. ప్రకటనలో పేర్కొన్న హక్కులు, స్వాతంత్ర్యా లన్నిటికి అంతా హక్కుదారులే. ప్రతి వ్యక్తికి సమాజం పట్ల కొన్ని విధులున్నాయని, ఆ సమాజంలోనే యధేచ్ఛనుయిన పూర్తి వ్యక్తిత్వం పొందుట అతనికి సాధ్యమని 29వ. సూత్రం ఉద్ఘాటిస్తుంది. ఇదిచాలా ముఖ్యమైన సూత్రం, కారణం, మనం సా ధా ర ణ ం గా హక్కులను గురించి మాట్లాడుతూ వాటికి ప్రతిగా నిర్వర్తించవలసిన విధుల సంగతి మరిచిపోతాం. ఈ సూత్రం ఆ విధులేమిటో నిర్వచించలేదు. దీనిలో వున్న ఒకేఒక లోపము అదే. 30 వ సూత్రంలో ప్రకటనలోని యే అంశమూ "యే దేశానికీ, వర్గానికి లేక వ్యక్తికి పేర్కొన్న హక్కులు, స్వాతంత్ర్యాలలో దేనికీ భంగకరంగా ప్రవర్తించుటకు, పని చేయుటకుహక్కు" యివ్వదని పేర్కొంటున్నది.

మిగిలిన 3-28 సూత్రాలలో హక్కుల జాబితా వుంది. వాటిని 1. వ్యక్తి, 2. మత, 3. సాంస్కృతిక, 4. సాంఘిక, 5. రాజకీయ, 6. ఆర్థిక హక్కులుగా విభజించవచ్చు.

వ్యక్తి హక్కులు: బానిసత్వంనుంచి రక్షణ, శాసనరీత్యా సమానత్వం, నిరంకుశమైన అరెస్టు, డిటెన్షన్ లేక ప్రవాసంనుంచి రక్షణ, స్వతంత్రమైన నిష్పాక్షిక న్యాయస్థానంచే న్యాయమైన విచారణకు అవకాశం, కదలిక, నివాస స్వాతంత్ర్యం, భావ, అభిప్రాయ, భావ ప్రకటనా స్వాతంత్ర్యం, శాంతియుత సమావేశానికి అవకాశం, హింసావిముక్తికై యితర దేశాలలో రక్షణను కోరిపొందుట. ఈనాడు యిట్టి వ్యక్తి హక్కులు లేని దేశాలు చాలా వున్నాయి. ప్రతి దేశంలోను యివన్నీ యివ్వబడాలని యీ ప్రకటన వుద్ఘాటిస్తుంది.

మత హక్కులు: భావ, ఆత్మ, మత స్వాతంత్ర్యం. ఈ హక్కులో మతం లేక విశ్వాసం మార్పుకి "మతాన్ని లేక విశ్వాసాన్ని బోధించుటకు, ఆచ

రించుటకు, పూజించుటకు, పాటించుటకు" అవకాశం వుంది. అన్నిరకాల మత హింసలను యిది దూషిస్తుంది.

సాంస్కృతిక హక్కులు: విద్యార్జన, వివిధ రకాల విద్యార్జన. పూర్వం విద్యార్జనకు పరిమిత మయిన ప్రత్యేక కులం లేక తరగతికిమాత్రమే హక్కువుండేది. అధికసంఖ్యాకులకు అందులో భాగం లేదు. ఈ ప్రకటన 26వ సూత్రం యిలా చెబుతున్నది. "ప్రతివారికీ విద్యార్జనకి హక్కువుంది. విద్య కనీసం ప్రాథమిక, మూల దశలలోనైనా వుచితంగా లభించాలి. ప్రాథమిక విద్య నిర్బంధం చేయబడాలి. సాంకేతిక, వృత్తి విద్యలు సర్వసాధారణంగా అందరికీ అందుబాటులో వుండాలి. ఉన్నతవిద్య అర్హులయినవారందరికీ సమానంగా అందుబాటులో వుండాలి." ఇట్టి హక్కుల వల్ల ప్రతివారూ తమ వ్యక్తిత్వాన్ని పెంపొందించు కొనుటకు అవకాశం యేర్పడుతుంది. వివిధ దేశాలు పరస్పరం అర్థం, చేసుకొనుటకు, సహనంతో, సుహృద్భావంతో జీవించుటకుకూడా యిది దోహదం చేస్తుంది.

సాంఘిక హక్కులలో వివాహం, కుటుంబాలకి సంబంధించినవి వున్నాయి. "జాతి, పౌరసత్వం, మతాల వల్ల యెట్టి హద్దులకి లోనుకాకుండా స్త్రీ పురుషులు వివాహమై, కుటుంబాన్ని యేర్పరుచుకోవచ్చు. కానున్న భార్యాభర్తల పూర్తి సమ్మతితో మాత్రమే వివాహం జరగాలి. కుటుంబం సంఘానికి సహజమైన మూలం. దానికి సంఘంయొక్క, ప్రభుత్వంయొక్క రక్షణ లభించాలి." వివాహ, కుటుంబ వ్యవస్థలపట్ల అర్థంలేని దాడిజరిగే యీ రోజులలో యీ ప్రాతినిధ్య ప్రకటన వాటికి యింత ప్రాముఖ్యాన్నివ్వడం ముదావహం.

నేడు మనం పరస్పర విరుద్ధాలైన ప్రజాస్వామ్యం, నిరంకుశత్వాల యుగంలో వున్నాం. కాబట్టి విశ్వజనీన ప్రకటన ప్రజాస్వామ్యంలో దృఢవిశ్వాసం ప్రకటించుట సంతోషకరం. ప్రభుత్వంలో పాత్ర వహించుటకు ప్రతివారికీ హక్కున్నదనీ, ప్రభుత్వాధికారానికి ప్రజాభీష్టమే ప్రాతిపదికగా వుండాలనీ, ఆ అభీష్టం అప్పుడప్పుడు న్యాయంగా జరిగే యెన్నికలలో వ్యక్తం కావాలని అది వుద్ఘాటిస్తున్నది. ఈ సూత్రం ఆమోదింపబడుట రాజకీయ స్వాతంత్ర్యానికి లాభదాయకం.

✱

ఈ ప్రకటనలో అనేక ఆర్థిక హక్కులు చేర్చబడ్డాయి. ప్రపంచంలో చాల దేశాలలో ప్రాథమిక పేదరికం, నిరుద్యోగం, యితర రకాల ఆర్థిక అభద్రతలు వున్నాయి-ఇవన్నీ మానవుల ఆనందానికి అడ్డంకులే. ప్రతి మనిషికీ పని చేసుకునే హక్కు, యేపని చేయాలో నిర్ణయించుకునే హక్కు, న్యాయమైన, అనుకూలమయిన పని పరిస్థితులు, సమాన పనికి సమానవేతనం హక్కు, న్యాయమైన ప్రతిఫలం పొందే హక్కు, ట్రేడ్ యూనియన్లను యేర్పరచి, వాటిలో చేరే హక్కు, విశ్రాంతి, తీరికల హక్కు, జీతంపై అప్పుడప్పుడు సెలవుపొందే హక్కు, సాంఘిక భద్రతహక్కు కలవని యీ ప్రకటన ఉద్ఘాటిస్తున్నది. ప్రభుత్వం యీ సూత్రాలను అమలు పరచినట్లయితే పేదరికం పూర్తిగా తొలగి స్త్రీ పురుషులు ప్రస్తుతంవలె ఆందోళనలకు, ఆవేదనలకు గురికాకుండా సుఖంగా జీవిస్తారు.

విశ్వజనీన ప్రకటన ఆదర్శప్రాయమైన మానవ సంఘాన్ని చిత్రిస్తుంది - అక్కడ స్త్రీ పురుషులు నిజమైన స్వాతంత్ర్యాన్ని కలిగివుండి, సర్వతోముఖమైన అభివృద్ధిని సాధించుటకు అవకాశం వుంటుంది. అక్కడ ప్రభుత్వం నిరంకుశంగా అధికారాన్ని చెలాయించదు కనుక అది ఆదర్శసంఘం. వారు స్వయంగా "న్యాయనిబంధన"కి తలొగ్గుతారు. మళ్లీ తమ పౌరులలో ప్రతిఒక్కరూ కాగలిగినంత సమర్థులుగా తయారగుటకు అవసరమయిన చర్యలన్నీ తీసుకుంటారు. ఇదే యీ ప్రకటన విశేషం.

అయితే యీ ప్రకటన శ్రీకృష్ణుడు లేక బుద్ధుని వంటి మహాప్రవక్త సందేశంవంటిది. అది మానవ జాతికి ఆదర్శాన్ని చూపిస్తూ అది నిర్ణయించుకోవలసిన లక్ష్యాన్ని తెలియజేస్తుంది. ఆ ఆదర్శం సిద్ధించి, గమ్యం చేరేలోపున ప్రభుత్వాలు, ప్రజలు చాలా పని చేయాలి. ప్రకటనలోని హక్కులతో ప్రతి దేశము శాసనం చేయాలి. చట్టబద్ధమైన హక్కుల అమలుకై స్వతంత్రమయిన న్యాయసంస్థను నెల

కొల్పాలి. ఈ ప్రకటన ఆమోదింపబడి పది సంవత్స రాలయినా యీ విషయంలో యెక్కువ కృషి జరుగలేదు. ఈ ప్రకటన సూత్రాలలోని హక్కుల అర్థం, అవి యెలా అమలుప రచబడాలన్న విష యాలలో చాలా అభిప్రాయ భేదాలున్నాయి. ఇప్పుడు మిత్రరాజ్యాలు యీ అభిప్రాయభేదాలకి గల కారణాలను తొలగించాలి. అప్పుడే యీ ప్రకటనవల్ల మానవజాతికి మేలు కలుగుతుంది. అలా గని యీ ప్రకటనకి అసలు విలువలేదని కాదు. దానికి మహోన్నతమయిన సందేశం విలువవుంది. మనం యెటువంటి రాజకీయ ప్రపంచాన్ని సృష్టిం చాలో అది మనకి విశదపరుస్తుంది.

# మానవ హక్కులు, స్వాతంత్ర్యాలు

(డా. ఎమ్. రామారావు)

రెండవ ప్రపంచ మహాయుద్ధసమయంలో యుద్ధ పక్షం జరిపిన దారుణ విధ్వంసకాండ, యింకా యుద్ధం జరుగుతుండగానే, ప్రపంచంలోని యోచనా పరు లకి పెద్ద ఆఘాతం కలిగించింది. చెప్పడానికలవి కానంత ప్రాణనష్టము, ఆస్తినష్టము కలిగింది. ఏ పాపము యెరుగని లక్షలాది పౌరులు కనీవినీ యెరుగని బాధలనుభవించారు. మాన వుని విలువే పూర్తిగా నశించిపోయింది. ప్రపం చంలో జ్ఞానంకలవారంతా భవిష్యత్తులో అసలు యుద్ధాలేకూడదని, శాశ్వత శాంతిని నెలకొల్పాలని కోరారు. ఈ అభిప్రాయం శక్తిని కూడగట్టుకొని 1941 జనవరి నాటికే తిరుగులేనిదిగా తయారయి లండన్ ప్రకటన రూపాన్నిధరించింది. ఈ లోపున, అంతాకలిసి సమిష్టిగా యుద్ధం జరుపుట లాభమని మిత్రరాజ్యాలు గ్రహించినవి; 1942 జనవరిలో యుద్ధం ముగిసిన పిమ్మట పరస్పరం సహకరించు కొనుటకు 26 దేశాలు శపథంగైకొన్నవి. మిత్రరా జ్యాల నాయకుల మనస్సులలో ప్రధానమైన ఆలో చనలు రెండే రెండు వున్నాయి. భవిష్యత్తులో యుద్ధాల నివారణ. రెండవది, శాంతికాలంలో అంతర్జాతీయ సహకారం. ఈ ఆలోచనలతో వారు అనేక మహాసభలు, సమావేశాలు, ఒప్పందాలు చేసు కున్నారు. ఇలానిరంతరాయంగా జరిపిన చర్చలవల్ల యీ ఆదర్శాలను ఆచరణలో పెట్టుటకై అంతర్జా తీయ సంస్థను నెలకొల్పాలన్న ఆలోచన కలిగింది. 1945 ఏప్రిల్-జూన్‌లో 50 దేశాల ప్రతినిధులు శాన్‌ఫ్రాన్సిస్కోలో సమావేశమై యెంతో ఆలో చించి సంయుక్త రాజ్యాల చార్టర్‌ని తయారు చేశారు. అవసరమైన రాజ్యాల సమ్మతి త్వరలోనే లభించింది. అవసరమైన లాంఛనాలన్నీ జరిగాయి: 1945 అక్టోబరు 24న మిత్రరాజ్య సమితి అనే కొత్త అంతర్జాతీయ సంస్థ అవతరించింది.

ఈ సంస్థకి రాజ్యాలతోనే కాక ప్రపంచ ప్రజ లతోకూడా సంబంధంవుంది. ప్రపంచ ప్రజల జీవితాన్ని వివిధరంగాలలో అభివృద్ధి పరచవలసిన దాని బాధ్య తనుగురించి ప్రత్యేకంగా చార్టర్ పీఠికలో యిలా పేర్కొనబడింది. "మానవ మూలహక్కులు, మనిషి ఔన్నత్యం, అర్హతలు, స్త్రీ పురుషుల సమాన హక్కులలో విశ్వాసం". ఈ సంస్థ తొలి సంవత్స రాలలో ముఖ్య సమస్యల పరిష్కారంలో నిమగ్న మైంది. ప్రపంచ ప్రజలపట్ల తన బాధ్యతను నిర్వర్తిం చుటకు దానికి 1947లో వీలు చిక్కింది. ఆ సంవ త్సరం అది అంతర్జాతీయ హక్కులబిల్లు తయారీకై మానవ హక్కుల సంఘాన్ని యేర్పాటుచేసింది. ఈ బిల్లులో డిక్లరేషను, కొవెనెంటు, ఆచరణకి చర్యలు అని మూడు భాగాలు వుండాలని నిర్ణయిం చబడింది. ఈ సంఘం యిందులో మొదటి భాగాన్ని తయారుచేసి మిత్ర రాజ్య సమితి సాధారణ సభకి అందజేసింది. ఆ సభ దానిని 1948 డిసెంబరు 10 న యేకగ్రీవంగా ఆమోదించి ఆరోజు మానవ హక్కుల రోజు అని ప్రకటించింది. ఆరోజున యేటా ప్రపంచ మంతటా సమధికోత్సహంతో వుత్సవం జరుపబడు తున్నది.

మానవ హక్కుల ప్రకటన (డిక్లరేషన్) అనే పత్రంలో ఉపోద్ఘాతము, 30 సూత్రాలు (ఆర్టికల్సు) వున్నాయి. అవి పైనచెప్పిన చార్టరు మూడు ఆశయాలను సూచిస్తాయి. ప్రకటన నిబంధనలను హక్కులు, స్వాతంత్ర్యాలు అని స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చు.

## హక్కులు

1. సాధారణ హక్కులు-ఎట్టి విభిన్నత లేక విచక్షణలేకుండా సమానమైన గౌరవము, హక్కుల వినియోగము 2. వ్యక్తి హక్కులు-జీవితం, స్వేచ్ఛ, వ్యక్తి భద్రత హక్కులు, బానిసత్వం, హింసలనుంచి మినహాయింపు, 3. న్యాయశాస్త్ర సంబంధమైన హక్కులు- శాసనంలో వ్యక్తిగా గుర్తింపు, శాసన రీత్యా సమానత్వము, శాసనంచే సమానమైన రక్షణ, మూల హక్కులు భంగమైనపుడు రక్షణకు చర్య, నిరంకుశమైన ఖైదు శిక్షనుంచి, అరెస్టు, ప్రవాసాల నుంచి మినహాయింపు, ఆరోపింపబడిన నేరాలన్ని న్యాయంగా విచారణ జరిగే అవకాశం. 4. వ్యక్తి హక్కులు-ప్రైవసీ, కుటుంబం, వివాహం, ఉత్తర ప్రత్యుత్తరాలు, గౌరవ రక్షణలకి, నిర్బంధ రహిత మైన కదలిక, ఆశ్రయాన్ని అర్థించుట, పౌరసత్వం, ఆస్తిని కలిగివుండు హక్కులు. 5. రాజకీయ హక్కులు-ప్రభుత్వంలో పాల్గొనే హక్కు, స్వదేశ ప్రభుత్వం క్రింద వుద్యోగంలోచేరే హక్కు. 6. ఆర్థిక హక్కులు-పనిచేసే హక్కు, సమానమైన పనికి సమానవేతనం, చేసినపనికి న్యాయమైన ప్రతిఫలం, ట్రేడ్ యూనియన్లను యేర్పరుచుట, వాటిలో చేరుట, విశ్రాంతి, తీరిక; తగినజీవన ప్రమాణం, నిరుద్యోగం, అంగవైకల్యం, అస్వస్థత, వృద్ధాప్యాల సందర్భంలో భద్రత. 7. సాంస్కృతిక హక్కులు-ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యకి హక్కు, కళా స్వాదనం, వైజ్ఞానిక పురోభివృద్ధి లాభాలను పంచుకొనుట. 8. సాంఘిక హక్కులు-సాంఘిక భద్రత హక్కు, సమాజ సాంస్కృతిక జీవితంలో పాల్గొనుట, సాంఘిక, అంతర్జాతీయ క్రమము.

## స్వాతంత్ర్యాలు*

భావ స్వాతంత్ర్యం, ఆత్మ, మత స్వాతంత్ర్యాలు; అభిప్రాయ, భావ ప్రకటనా స్వాతంత్ర్యం; శాంతి యుత సమావేశము, అసోసియేషను.

మిత్రరాజ్య సమితి ప్రకటనను ఆమోదించినప్పటినుంచి మానవ హక్కుల సంఘం రెండరగా కొవెనెంట్లను తయారు చేస్తున్నది. ఆర్థిక సాంఘిక సాంస్కృతిక హక్కులపై ఒకటి, పౌర, రాజకీయ హక్కులపై ఒకటి మొత్తం రెండు కొవెనెంట్లు తయారుచేయబడినవి. ఈ రెండిటిలోను కూడా స్వయం. నిర్ణయం, స్త్రీ పురుషులకు సమాన హక్కులు, హక్కుల వినియోగంలో విచక్షణా రాహిత్యానికి సంబంధించిన నిబంధనలు వున్నాయి.

ఈ హక్కుల అమలు: దానికి సంబంధించిన పని ఇ ఎస్ సి, ఐ ఎల్ ఓ, యునిసెఫ్‌ల వంటి సమితి ప్రత్యేక సంస్థలద్వారా జరుగుతున్నది.

డిక్లరేషన్ ఒక వున్నతాశయంయొక్క పవిత్ర భావ ప్రకటనగా నిలిచిపోలేదు. అది అంతర్జాతీయ రంగంలో ఆచరణ రాజకీయాలలో శక్తివంతమైన ఒక అంగంగా పని చేస్తున్నది. సమితిలో సభ్యత్వం గల పెక్కు రాజ్యాలు యీ హక్కులను పరస్పరం చేసుకునే ఒప్పందాలు, ఒడంబడికలలో చేరుస్తున్నవి. ఉదాహరణకు, 1951 లో జపాన్‌తో చేసుకున్న శాంతి ఒడంబడిక; 1954 లో ఇటలీ, ఇంగ్లండు, అమెరికా, యుగోస్లావియా ప్రభుత్వాలు చేసుకున్న ఒప్పందము; 1947 లో జరిగిన ఇటలీ, రుమేనియా, బల్గేరియా, హంగరీ, ఫిన్లండుల ఒడంబడికలు. 1955 లో ఆస్ట్రేలియాతో చేసుకున్న ఒడంబడిక. ప్రపంచం వివిధ దేశాలలో యీ హక్కుల అమలు

పురోభివృద్ధిని సూచిస్తూ మిత్రరాజ్య సమితి యేటా మానవ హక్కుల వార్షిక గ్రంథాన్ని ప్రకటిస్తున్నది.

ఈ విధంగా మిత్రరాజ్యసమితి మానవజాతి మేలుకై తాను చేపట్టిన వుత్తమ కార్యాలలో ఒక దానిని సమర్థంగా జరుపుతున్నది. సర్వసత్తాక ప్రతిపత్తిగల దేశంలోకాని స్వయం పరిపాలనలేని ప్రాంతంలో కాని నివసించే ప్రజలకు మానవ మూల హక్కులను, స్వాతంత్ర్యాలను నిరాకరించుటకు, వీలులేదు. అలా నిరాకరింపబడిన ప్రజలు మిత్రరాజ్య సమితికి ఫిర్యాదుచేసి దానిద్వారా తక్షణం న్యాయం పొందవచ్చు.

మానవ హక్కుల ప్రకటన, స్వేచ్ఛారహితులైన ప్రజలకు స్వేచ్ఛను, స్వేచ్ఛాయుతులైన ప్రజలకు హక్కులు, స్వాతంత్ర్యాల రక్షణను యిచ్చే హామీ పత్రం. 20 వ. శతాబ్దంలో అంతర్జాతీయ రంగంలో పరస్పర అవగాహన, సహకారాల రంగంలో అది ఒక ముఖ్యఘట్టం.



# ప్రభుత్వ ప్రచురణలు

1. ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
2. ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం ( ఇ* లేక తె* లేక ఉ* ) 0.12 న.పై.
3. ఆంధ్రప్రదేశ్ చేతి పనులు ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
4. ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ( ఉ* ) 0.12 న.పై.
5. ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
6. ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు ( ఉ* ) 0.12 న.పై.
7. హైదరాబాదు నగరం, శివార్లు - గైడ్ - ( ఇ* ) 0.50. న.పై.
8. హైదరాబాదు నగరం పటం 0.12 న.పై.
9. ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ( ఇ* ) 0.25 న.పై.
10. ఆంధ్రప్రదేశ్ మత్స్యసంపద ( ఇ* లేక తె* ) 0.12 న.పై.
11. ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు ( ఇ* ) 0.12 న.పై.
12. ఆంధ్రప్రదేశ్ స్థూల స్వరూపం (ఆంధ్రప్రదేశ్ యెట్ యెగ్లాన్సు) ( ఇ* ) 0.12 న.పై.
13. నూతన గ్రామాల నిర్మాణం-ఆంధ్రప్రదేశ్‌లో సమాజాభివృద్ధి ( ఇ* ) 0.12 న.పై
14. ఆంధ్రప్రదేశ్ — ధాన్యాగారం - ( ఇ* ) 0.12 న.పై.

*గమనిక:*—ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

*ఇ = ఇంగ్లీషు
*తె = తెలుగు
*ఉ = ఉర్దూ

ప్రతులకై
ప్రచురణల విభాగం, సమాచార,
పౌరసంబంధాల డైరెక్టరు కార్యాలయం,
హైదరాబాదు 1.
చిరునామాకు వ్రాయండి.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల ఎకరాలు |
| కొళ్ళ సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పరిమాణం | ... | రూ 175.37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ 63.66 కోట్లు |
| వ్యయం | ... | ,, 62.87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, 21.29 ,, |

